నవంబర్ 1986

171

# సృజన



ఇరవయ్యోవ జన్మదిన సంచిక

## అర్థిక, హార్దిక సహకారాన్నందించి
## సృజనను ఆదుకోండి!

నిర్బంధం, నిర్వహణా సమస్యలు, అర్థికసమస్యలు కలిసి సృ
ప్రచురణను ఇన్నాళ్ళూ కష్టసాధ్యం చేశాయి. ప్రస్తుతం ఈ సమస్య
అధిగమించి సృజనను కొనసాగింపజేయాలని సాహితీ మిత్రులు అకా
స్తున్నారు. ఈ అకాంక్ష సఫలం కావడంలో మీ అందరి తోడ్పాటు
సాహితీ మిత్రులు కోరుకుంటున్నారు.

సృజనపై నిర్బంధాన్ని ఖండించండి.

సృజనకు విరివిగా రచనలు పంపండి. అచ్చయిన రచనలపై
నిర్మొహమాటమైన అభిప్రాయాలు రాయండి.

సృజనకు చందాలు చెల్లించండి. మీ మిత్రులను చందాదా
చేర్పించండి. సృజనకోసం విరాళాలు పోగు చెయ్యండి. సృజనకు మీ
ప్రాంతాలలో నమ్మకమైన ఏజెంట్లను కుదిర్చి పెట్టండి.

సృజన మీ పత్రిక. సృజనను నిలబెట్టే బాధ్యత మీదే.

చందాలు, రచనలు పంపవలసిన అడ్రస్ :

సృజన
రమణనగర్
విజయవాడ-520 010.

# సృజన

## ఆధునిక సాహిత్య వేదిక

**171** మాసపత్రిక నవంబర్ **1986**




నిర్వహణ

**'సాహితీ మిత్రులు'**

సంవత్సర చందా రు. **30** ఈ సంచిక రు. **3.**

# నిరంతర సృజన సంభాషణ

పదినెలల మౌనాన్ని ఛేదించుకుంటూ సృజన మళ్ళీ తన పాఠకులతో సంభాషణ ప్రారంభిస్తున్నది. సమాజం తనతో తాను సాగించుకుంటున్న సంభాషణను ప్రసారం చేసే ఒక వాహిక సృజన మళ్ళీ తన కార్యాచరణను ప్రారంభిస్తున్నది. ఇరవై సంవత్సరాలుగా తెలుగు సమాజంతో తాను కొనసాగిస్తున్న నిరంతర సంభాషణను రాజ్యం అన్ని హింసారూపాలతో బలవంతాన గొంతునులిమి ఆపేస్తే మెల్లమెల్లగా తేరుకుని గొంతు సవరించుకుంటున్నది సృజన.

ఇవాళ మళ్ళీ వెలుగు చూడబోతున్న సృజన గురించి మాట్లాడాలంటే గత రెండు సంవత్సరాలుగా తెలుగు సీమలో కమ్ముకుంటున్న చీకటి గురించి మాట్లాడాలి, ఆరిపోతున్న వెలుగుల గురించి మాట్లాడాలి. ఎప్పుడూ చీకటిదే రాజ్యం కాజాలదనీ వెలుగు శాశ్వతంగా ఆరిపోవడం ఎన్నటికీ జరగదనీ వర్తమాన సంధ్యను చూపుతూనే భవిష్యదుజ్జ్వల ఆశాకాంతిని దర్శింపజేయాలి. ఇవాళ సృజన గురించి మాట్లాడాలంటే ప్రజాజీవన ఆకాంక్షలను, ప్రజా రాజకీయాల పతాకాన్ని ఒక అవశ్య ప్రాపంచిక దృక్పథంగా మళ్ళీ మళ్ళీ గుర్తుచేయాలి. ఆ ఆకాంక్షల పతాకానికి గుండె నెత్తురద్ది ఎత్తి పట్టవలసిన అవసరం సృజనాత్మక కళాకారులకు ఖచ్చితంగా ఇవాళనే ఎంత బలీయంగా ఉన్నదో చెప్పాలి. విగతజీవులవుతున్న వీరుల చేతినుంచి ఆ పతాకాన్ని అందుకుని అనవరతం గాలిలో తేలియాడేలా చూడవలసిన బాధ్యత మన మీద ఎంతగా ఉన్నదో వివరించాలి.

ఈ సంచికతోనే సృజన మళ్ళీ పుట్టడం యాదృచ్ఛికం కావచ్చుగాని, సరిగ్గా ఈ సంచికకే సృజనకు ఇరవై సంవత్సరాలు నిండుతున్నాయి. ఈ ఇరవై వసంతాలలో, ఈ ఇరవై గ్రీష్మాలలో తెలుగునాట సామాజిక జీవనమూ సృజనా కలగలుపుకున్న ఆశ నిరాశలనూ, విజయాలనూ వైఫల్యాలనూ విశ్లేషించుకుంటూ, మార్గం నిర్మించుకుంటూ ముందుకు సాగడమే ఇవాళ సృజన కర్తవ్యం. సంఘర్షణలో, పురుటి నొప్పులలో ఉన్న సామాజిక జీవనాన్ని ప్రతిఫలిస్తూ, అద్భుత ఆశావహ భవిష్యత్తును అక్షరీకరించే బాధ్యతను సృజన సవినయంగా మళ్ళీ ఒకసారి స్వీకరిస్తున్నది.

త్రైమాసికగా 1966 నవంబర్‌లో పుట్టిననాడు సృజన తనను తాను ఆధునిక సాహిత్యవేదికనని నిర్వచించుకుంది. "ఆధునిక సాహిత్యమంటే - శాస్త్రీయ దృక్పథం, హేతువాదం, సమకాలీన సమాజం, దీనిప్రభావం వ్యక్తి జీవితంలోని అన్ని అంశాల

మీద కొద్దోగొప్పో ఉన్నదని గుర్తించడం. ఈ గుర్తింపు ఉన్న రచనని ఆధునిక సాహిత్యంగా నిర్వచించవచ్చు: ఇతరమైన విలువల్ని కూడా విస్మరించకుండా," అని ఆధునిక సాహిత్యం పట్ల తన అవగాహన ప్రకటించింది.

ఇది "మారుతున్న కాలాన్నీ, విస్తరిశమౌతున్న జాగృతినీ ప్రతిబింబించే, అనువదించే ఫోరమ్....ప్రయోగ శీలత్వం, సృజనాత్మక శక్తి, ఆధునిక ఒక దృక్పథం ఈ ఫోరమ్ పునాదులు" అని కూడా సృజన ప్రకటించుకుంది.

1966 తర్వాతనే దేశమంతటా, రాష్ట్రంలోనూ మారుతున్న కాలాన్నీ, విస్తృతమవుతున్న జాగృతినీ ప్రతిబింబించడమూ, అనువదించడమూ ప్రధానంగా ప్రజా రాజకీయాలలో మాత్రమే భాగం కావడం అనే పరిణామం మొదలయింది. సృజన తన అస్పష్ట, సుదూర లక్ష్యాల నుంచి నేల మీదికి దిగివచ్చి ప్రజారాజకీయాలలో క్రియాశీలంగా భాగమైంది. ఆధునిక సాహిత్యానికీ, ప్రజా రాజకీయాల అభినివేశానికీ తేడా చెరిగిపోయిన నక్సల్బరీ సాంప్రదాయంలో సృజన నిజమైన ఆధునిక సాహిత్యవేదికగా నిలిచింది, ప్రజాపోరాట ప్రతిఫలన వేదికగా ఎదిగింది. అందువల్లనే తన పాఠకులకు మరింత చేరువయ్యేందుకు సృజన మాసపత్రికయింది, మాండలిక రచనలకూ, పాటలకూ, కథనాలకూ వాహిక అయింది.

ప్రజల పత్రికగా, ఆధునిక సాహిత్య వేదికగా ప్రజలకూ, సాహిత్యాభిమానులకూ సృజన ఎంత సన్నిహితమయిందో, రాజ్యానికి అంత కంటక ప్రాయమయింది. ఇప్పటికి ఆరు సంచికలపైన నిషేధం, ఎడిటర్, ప్రింటర్, పబ్లిషర్ పై సృజన గురించే రెండు కేసులు, అరెస్టులు, కార్యాలయం సోదాలు, దాడులు, బెదిరింపులు, దుష్ప్రచారాలు .... ఇంకా అనేకానేక నిర్బంధాలు నిషేధాలూ అమలయ్యాయి.

రాజ్యం కేవలం తన చేతిలోని నిర్బంధ యంత్రాంగం ద్వారా మాత్రమే కాదు, తన అన్ని హింసారూపాలతో సృజన మీదవిరుచుకుపడింది. సృజన కొనసాగలేని ఒక భయానక వాతావరణాన్ని సృష్టించింది. సృజన నిర్వహణను రాజ్యం కష్టసాధ్యమూ, అసాధ్యమూ చేసింది. సృజన ప్రాణప్రదంగా ఎంచి, సమర్థించి, తోడు నిలిచిన ప్రజాపోరాటాన్ని రక్తపు టేర్లలో ముంచి నాశనం చేయదలచుకున్నట్టుగానే సృజననూ రాజ్యం ఆపెయ్య దలచుకుంది.

సృజనను రాజ్యం ఎందుకు ఆపుతుంది ? ఎందుకంటే రాజ్యం ఒక హింసా సాధనం. దానికి స్వయంగా సృజనాత్మకత లేదు. ప్రజాజీవనంలో, ఘర్షణలో, జీవన్మరణ సంఘర్షణలో వెలికి వచ్చే సృజనను అది ఐతే కానివేయడానికిప్రయత్నిస్తుంది, లేదా చంపేయడానికి ప్రయత్నిస్తుంది. సమాజానికి సృజనాత్మక శక్తి ఉండడానికి రాజ్యం వ్యతిరేకం. అందుకే సృజనకు రాజ్యం వ్యతిరేకం.

అందువల్లనేరాజ్యంసృజననువక్రీకరిస్తుంది.జీవన సంఘర్షణా జనితంకాని మాటల గారడీని సృజనాత్మకతగాప్రచారం చేస్తుంది. అనిర్దిష్ట అస్పష్ట "కళాత్మకత"ను సృజనగా ప్రచారం చేస్తుంది. దేవకి సృజనను కంసుడు చిదిమేసినట్లు నూత్న శిశూదయాన్ని అరచేతితో అడ్డుపెట్టాలని ప్రయత్నిస్తుంది. ఇవాళ తెలుగుదేశంలో రాజ్యం నిలుపుతున్న భయంకరమైన సంస్కృతి ఇదే. దానికి విలువలు లేవు, విలువలు లేకపోవడమే, విలువల పతనమే దాని విలువ. దానికి సృజన లేదు, సృజన హత్యే దాని "సృజన."

మరి ఈ మిడతల దండుకు మన పొలం వదిలేయడమేనా? మన రక్తమాంసాలు పోసి, మననెత్తుట్ని చెమట చేసి రెండుచేతుల బోదెల్లో ప్రవహింపజేసి సాకుకొచ్చిన పంటను ఈ మేకాలకు అప్పనంగా అందించడమేనా ? లేదు, నూత్నసృష్టి లక్ష్యం పరాధీనత కాదు, నూత్న సృష్టి లక్ష్యం మరణం కాదు. ఘర్షణకు ఫలితం స్తబ్దతో, వెనుకడుగో కాదు, కారాదు.

ఘర్షణ ఏదో సుదూర సిద్ధాంతం కానప్పుడు, అది మన రక్తనాళాలలో పొంగిపొర్లుతున్న నెత్తురంత సహజమని అర్థమైనప్పుడు, విప్లవం ఒక సిద్ధాంతమో, ఒక నమూనానో ఒక వృత్తో కాక జీవితమయినప్పుడు, మన ప్రాపంచిక దృక్పథమైనప్పుడు, మన నూత్న సృష్టి అభివృద్ధికే అవుతుంది, మన ఘర్షణ ఫలితం పురోగమనమే అవుతుంది. మన కార్యాచరణ సహజమూ అనివార్యమూ అయి అజేయశక్తి అవుతుంది. నూత్నసృజనను శాశ్వతంగా చంపగలవాడు ఇప్పటిదాకా భూమి మీద పుట్టలేదు.

సృజన ఈ సృజనను దాని వాస్తవ అర్థంలో, సహజత్వంతో అర్థం చేసుకుంటున్నది. సృజన నిజమైన సృజనాత్మకతను హామీ ఇస్తున్నది. సృజన భవిష్యత్తును పుష్పింప బోతున్నది. పదినెలల మౌనానికి పాఠకులను క్షమాపణ కోరుకుంటూ, కర్తవ్యానికి పునరంకితమవుతూ సృజన మళ్ళీ తన సంభాషణ కొనసాగిస్తున్నది.

అక్టోబర్ 28, 86 — 'సాహితీ మిత్రులు'

# నిశ్శబ్దం చీడకావద్దు

సర్వధారి

చెప్పవూ
నువ్వైనా చెప్పవూ
పగిలి పోయిన అద్దాల బీరువా
నువ్వైనా చెప్పవూ
తొక్కిస లాటలో మిగిలి పోయిన కళ్ళద్దాలూ
మీరైనా చెప్పరూ
మూసిన తలుపు రెక్కల్ని
తన్ని తోసుకుంటూ
లోపలి కొచ్చిందెవరూ
మూలకొరిగి పడ్డ కుర్చీ
ముక్కలు చెక్కలైన బల్లచెక్క
మీరైనా చెప్పరూ
చిందర వందరైన గదీ
ఎవరమ్మా
మా గుండె చప్పుళ్ళ స్టెతస్కోపుని
చితలు చేసిందెవరమ్మా

* * *

మా ఊళ్ళో నిర్బంధం
కలకల మయ్యేది
కరపత్ర మయ్యేది

మా ఊళ్ళో మరణం
ఉద్రేకమయ్యేది
ఊరేగింపయ్యేది
సమావేశమై
సభై

నినాద సముద్రమై
పోరాట తోరణమైన ఊరు
నీచేతుల్లో ప్రాణం పోసుకున్న పాపలు

నీ శవానికి పూలమాలలేస్తున్నపుడు
రామనాథం అమర్ హై
అనలేదు
నీ శవం వెంటమేమూ
మావెంట తుపాకులతో పోలీసులు నడిచినపుడు
పోలీస్ జులుం నశించాలి
అనలేదు
నిన్ను చితిమీద పెట్టి
ఒకొక్కకట్టెను నీమీద పెట్టి
నిన్ను కప్పెట్టి
కాల్చేసినపుడు కూడా
ఏమీ అనలేదు
కాని రామనాథం మాత్రం
'విప్లవం వర్ధిల్లాలి' అన్నాడు
ఊరు విన్నది
నీ బతుకును
నీ మరణాన్ని
గుర్తు పెట్టుకున్నది

## 2

ఊపిరి కోసమో
ఉద్యమం కోసమో
ఒకడు ఊరొదిలి పెడతాడు

ఊపిరి కోసమో
ఉద్యమం కోసమో
ఒకడు వెలుక పోతాడు

ఊపిరి కోసమే అయితే
వానికి ఊరు మీద
ఊపిరెందుకు కొట్టుకుంటుందో

ఉద్యమం కోసం కాకుంటే
వానికి జైల్లో
ఊపిరెందుకు సలుపదో

## 3

వాడెవ్వడు
వాని అధికారాన్ని అధిగమించేందుకు
వాడెవ్వడు
నా యింట్లో నన్ను బతుకనియ్యడు
నా ఉద్యోగం నన్ను చేయనివ్వడు
నా మాట నన్ను మాట్లాడనీయడు
నా పాట నన్ను పాడనివ్వడు
నా ఊపిరి నన్ను తీయనియ్యడు
నేనెవని యింటి పక్కనుంటే
ఎవనింట్లో అద్దెకుంటే వానికెందుకు
నడిబజార్లో నిలేసి
లాకప్‌లోకి తోసి
నన్ను బెదిరించి హింసిస్తాడెందుకు
నేను దోషినంటాడు
ద్రోహినంటాడు
నా జన్మభూమికి నన్ను పరాయిని చేస్తాడు
ఎందుకు
ఇంటింటి మీదపడి
పిల్లా మేక సమస్తాన్ని కాల్చుకు తింటాడు
ఎందుకు

నాకు తెలియని సమాచారాన్ని
తనకు చెప్పమని చంపుకు తింటాడు
ఎందుకు

మాట పగలాలి
అణువులుగా
అణువులు అణువులు అణువులుగా
మాట పగలాలి
ఇప్పుడు తుపాకులను ధ్వంసిస్తూ
మాట పగలాలి
మాట బందూక్‌లా పేలాలి
కంఠం ఫిరంగి
మాటల్ని దట్టించండి
మౌనాల్ని పగులకీయండి
నిశ్శబ్దాన్ని తునాతునకలు చేయండి

నిశ్శబ్దం మృత్యువు
నిశ్శబ్దం శత్రువు
మృత్యువును అధిగమించండి
శత్రువును అణగదొక్కండి

## 4

రోడ్డు పక్క ఎడంగా రెండు శవాలు
పొలాల మధ్యగా
పొలాల్ని కౌగిలించుకుని రెండు శవాలు
కాదు, రెండు ప్రాణాలు
నేల గంధం రాసుకుని
నేలంతా పాదుకుని

కాలానికి ప్రతీకగా
'ఎన్‌కౌంటర్' రోడ్డు మీద
రెండు ప్రాణాలు
నిండు ప్రాణాలు
ఒకటి వెల్గుల పగలు
ఒకటి వెన్నెల రాత్రి

వర్తమానం నెత్తుటి వరద
వర్తమానం నెత్తుటి వారధి
రేపటి స్వప్నానికి
ఇవాళ్టి కనుమూత

## 5

జీపులు స్టెన్‌గన్స్ మోస్తున్నాయి
కాదనను
నడుస్తున్నవాడు ఆగి మాట్లాడితే
నక్సలైట్ అవుతున్నాడు
కాదనను
గుడ్డలిప్పదీసి మధ్యాహ్నపు ఎండలో
రోడ్ల మీద దొర్లిస్తున్నారు
కాదనను
భయంకర చిత్రహింసల్లో
ప్రాణాలు తోడేస్తున్నారు
కాదనను
గొడ్డళ్ళతో ఇళ్ళతలుపులు
బద్దలు కొడుతున్నారు
కాళ్ళు చేతులు విరగ్గొడుతున్నారు
తలలు పగుల గొడుతున్నారు

కాదనను
ఇక్కడ భూమికూడ
శవం జాడ తెలియదు
ఇవాళ మావూరు గాయపడ్డ తుపాకి
పులి తొక్కల చిత్తడి నేల
నిజమే
అయితే
భయం ప్రచారం కావద్దు
భయం రక్షకవచం కావద్దు
భయం వ్యవహారం కావద్దు

నెత్తుర్లతో నేల
పరిపుశిస్తూనే వున్నది
కాదనకు
గాలిలో విద్యుత్తు
ప్రవహిస్తూనే వున్నది
లేదనకు
పాట ప్రసరిస్తూనే వున్నది
విను
ఆకాశం ఉదయిస్తూనే వున్నది
ఆగకు
విప్లవం విజయవంతమయ్యేదాక
నిర్బంధం కొనసాగుతూనే వుంటుంది
ఎదుర్కో

# డారుహావు[1]

వెతల అప్రతిభ

అదృష్టవంతులు మీరు
పెట్టి పుట్టారు
మీ భాషలో చెప్పాలంటే
నోట్లో వెండియు బంగారు చెమ్చాతో పుట్టారు

మీ ఆందోళన సృజనాత్మకంగా వుంటుంది
మా ఆవేదన హింసాత్మకంగా కనిపిస్తుంది

మీరు ప్రతిభాశాలురు
దినపత్రికల మొహాలమీద సూర్యకిరణాల్లా
అచ్చయ్యేంత అందంగా
బస్సుల అద్దాలు పగులగొట్టగలరు
ప్రశంసాపూర్వకంగా ముక్కున వేలేసుకొని
చెక్కలి రైఫిల్‌పై ఆనించి పోలీసులు చూస్తుండగా
టైర్లలో గాలి తియ్యగలరు
రోకళ్ళు ఎక్కించే పోలీసు స్టేషన్లకు వెళ్ళి
రాఖీలు కట్టగలరు

పైసలు లేక కాదుగదా మీరు బస్సుల్లో టికెట్లు కొనంది
అది ప్రయోగాత్మక నిరసన

ఈ అందమైన రోడ్లన్నీ రాస్తా రోకాయించినా మీవే
సేఫ్ మెరిట్ స్టిక్కర్ల వాహనాలు ప్రవహించినా మీవే

పట్టికాళ్ళ డాంబర్ మొహాల చెమటకంపు
రోడ్డు రోలర్లం మేం నిర్మిస్తే మాత్రం ఏం
ప్లాన్ వేసిన ప్రతిభ మీది
కాంట్రాక్టు క్రెడిట్ మీది

ఆ అరవై రోజులూ ఎంత అందమైన ఆందోళన

మీ ఆడపిల్లలూ తోడైన మగపిల్లలూ
అపురూపమైన అల్లరి చేస్తుంటే
తలిదండ్రులకూ పెద్దలకూ అన్నలకూ ముద్దే
నౌకర్లకూ ముద్దే

అచ్చేసే పత్రికలకు ఒళ్ళంతా పులకరింతలు

ప్రతిభ సమాధిఅయి భవిష్యత్తు అంధకారమైందని
ప్రొటెస్ట్‌గా
చెట్టా పట్టాలేసుకొని యువతీ యువకులు
యాదగిరి గుట్టకు పిక్నిక్‌కు పోవడం
యారో(
ఎంత హిరాయిక్‌గా వుందని !

మెరిట్ పందెంలో మరాథన్ రన్నర్లు మీరు
తాఁబేలు గాళ్ళం
మీతో పోటీ పడగలమా

మీరు చిక్కడ పల్లిలో చాయ్ అమ్మినా
సినిమాల్లో పల్లీలమ్మినా
కోటీలో బూట్ పాలిష్ చేసినా
ట్యాంక్ బండ్‌పై 'చందా' మామా అంటూ
మారుతీ కారుకో ప్రియాస్కూటర్‌కో
వయారంగా అడ్డం పడినా
దొడ్డ బుద్ధుల పత్రికలు గనుక
వాటి కెమెరా గుండెలు క్లిక్కుమన్నాయి
వాటి కలాల్లో యవ్వన ప్రతిభ కళాత్మకంగా కలవరించింది

దేబెమొహాలం
రోజూ చచ్చిన గొడ్డు కొఁజు కంపులో కూలబడి
చెప్పులు కుడతాం
మానెత్తురుతో రంగుపూస్తాం

కుంకుతున్న సూర్యుని వంటి
మా కళ్ళలోని కాంతితో పాలిష్ చేస్తాం
అయినా
బూట్లు వేసుకున్న వాళ్ళ బూటు పాలిష్ చేయడంలో ఉన్న
సృజనాత్మకత వుంటుందా
మీ మనుషుల మలమూత్రాలు ఎత్తి పోస్తాం
నెత్తి మీద బకెట్లతో ఎత్తుక పోతాం
మీ టాయ్‌లెట్ మొదలు డ్రాయింగ్‌రూం వరకు
మీ శరీరాల వలె మెరిసేలా
మా శరీరాలు అరగదీసి కడుగుతాం
ఊడుస్తాం తుడుస్తాం
మా చేతులు చీపుర్ల వుతాయి
మా చెమట నీళ్ళవుతుంది
మా నెత్తురు ఫినాయలవుతుంది
మా ఎముకలు వాషింగ్ పౌడర్ల వుతాయి
కాని ఇదంతా ఒట్టి బండచాకిరీ
ఇందులో ప్రతిభా చట్టుబండలా నైపుణ్యం ఏముంది

మీ టక్ చేసుకున్న వాళ్ళు మినీస్కర్ట్సు వేసుకున్న వాళ్ళు
జీన్సూ హైహీల్సూ
సిమెంటు రోడ్డుపై చిరుహాసంతో చిమ్మితే
అది ఆకాశవాణి సందేశమై
టీవీ దృశ్యమై మైమరపిస్తుంది

మేం రిక్షా వాళ్ళం అమాలీలం తోపుడు బళ్ళ వాళ్ళం
చిల్లర దుకాణాల వాళ్ళం గుమస్తాలం
బిడ్డ పాలకోసం ఆకలితో కొరికినా
నెత్తురు రాని తల్లులం
ఆసుపత్రి క్యూలల్లో నిలబడి
కూటికోసం నెత్తురమ్ముకుంటాం

ఆకలి దరిద్రం చెమట వాసనే తప్ప దానికి
మీ ప్రతిభాశాలురి రక్తదానంలోని
దేశభక్తి పరిమళమెలా అబ్బుతుంది

మీరేం చేసినా
ఊడ్చినా బూట్‌పాలిష్ చేసినా
రైల్వే స్టేషన్‌లలో బస్‌స్టాండ్‌లలో సామాన్లు మోసినా
తోపుడు బళ్ళలో పళ్ళమ్మినా
ఫుట్‌పాత్‌లపై చాయ్ అమ్మినా
షేవ్ మెరిట్ నుంచి సేవ్ మెరిట్ [2] అని
ప్లెకార్డులు పట్టుకొని
కాన్వెంట్ ప్రొనన్సియేషన్ స్లోగన్ల ప్రొసెషన్లు తీసినా
మా సహస్ర వృత్తుల శ్రమైక జీవనం
మీ ప్రతిభకు సాటిరాదని చెప్పడానికేనని మాకు తెలుసు

షిఫాన్ చీరెల మీద పంజాబీ దుస్తుల మీద
తెల్ల కోట్లు వేసుకొని
నల్ల రిబ్బన్లు నోటికి చుట్టుకొని
స్టైత్ వేళ్ళాడే గుండె మీద
సేవ్ మెరిట్ స్టిక్కర్లు తగిలించుకొని
సెక్రటేరియట్ ముందు చినుకుల్లో తడుస్తున్న
నగంకన్న ఎక్కువే ఉన్న మీ స్వర్గాన్ని చూస్తుంటే
మీలోని ఇనిసిలకు
మాలో పన్నెండ్వేలు దాటి నోళ్ళకు
రిజర్వేషన్ల జీవో
తొలగిన స్వర్గం తొణికిన స్వప్నం
మాత్రమే కాదు
విరిగిన ఇంద్రధనస్సుకూడ

మావోడు చెప్పిన మాయమాటలు నమ్మాను గానీ
మాకు మిగిలింది శూన్యాకాశం గనుకనే

మా ఆడోళ్ళెప్పుడూ అందుకోసం నేలవిడిచి ఎగబడలేదు
మీది భూతల స్వర్గంలో ఊహాహల ఉద్యమం
అందుకే అమృతం హక్కుకోసం
దేవతలే ఎక్కువగా తెగించారు

మీ పగడాల పెదవుల మీంచి రతనాల వాణి
ప్రెస్ కాన్ఫరెన్సులో
జైల్ భరో పిలుపు ఇచ్చిందో లేదో
ఇక్కడ మమ్మల్ని బ్యారక్‌ల నుంచి
బల్లుల గబ్బిలాల ఆవాసానికి
కుళ్ళిన చెత్తకుప్పల సెల్లులోకి మార్చి
మీకోసం ఎర్రతివాచీ (ఈడియమ్ మాత్రమే
అదంటే పరచిన వాళ్ళకూ భయమే)
స్వాగతం సిద్ధం చేసారు
అరవై రోజులా
మీ సృజనాత్మక పాదధూళితో
ఆంధ్రదేశమే కాదు అందులో జైళ్ళూ పావనమవుతాయని
అత్యాశతో ఎదురు చూసాం

దొంగలను నేరస్థులను దేశద్రోహులను
తోసే జైళ్ళలోకి
భావిభారత భాగ్య విధాతలైన
ప్రతిభాశాలురను తెస్తారా !

గొప్పవాళ్ళ పిల్లల పెళ్ళిళ్ళు జరిగే
ఫంక్షన్ హాళ్ళే మీ జైళ్ళయ్యాయని
చంద్రశాలలే మీపాలిటి చెరసాలలయ్యాయని
చదువుకొని మాజన్మ తరించింది

మాది మరణాంతక జీవన సమరం గానీ
మీ ఉద్యమం నిజంగా గొప్పింటి పెళ్ళిలాగే వుంది
మీరలిగితే పెళ్ళి అలక లాగుంధి

మీరు ఫన్నీచరో పాలకేంద్రమో తగలబెడితే
బాణ సంచా కాల్చినట్లున్నది
మీరు 'బంద్' చేస్తే
దొర ఇంట్లో పెళ్ళి ఊరికంతా పెళ్ళి లాగున్నది

మీరు అదృష్టవంతులు
మీ ప్రతిభ శవం నగర రాజవీధుల గుండా ఊరేగి
సంస్కృత మంత్రోచ్చాటనలతో
చౌరస్తాలో దహన సంస్కారాలు జరుపుకుంటుంది
ప్రతిభకు చావులేదు గనుక
మీరు సృజనాత్మకంగా శవయాత్ర నిర్వహిస్తారు
దుఃఖాన్ని అభినయిస్తారు

మాకు
చావడానికైనా చంపబడడానికైనా
ప్రతిభ వుండి చస్తే గదా
కష్టం చేసో నేరం చేసో
ఆకలితోనో రోగంతోనో
(ఆకలే రోగమంటే ప్రతిభాశాలురు ఒప్పుకోరు)
నిరుద్యోగంతోనో ఉద్యమంలోనో
కరువులోనో వరదల్లోనో
లాకప్‌లోనో ఎన్‌కౌంటర్‌లోనో
ఉరిపోసుకొనో చెరచబడో
చచ్చిపోతాం
ఏ రోడ్డు వారనో
ఏ చీకటి గొయ్యిలోనో
ఏ పెంట కుప్పమీదనో
మున్సిపాలిటీ కుండీలోనో కాలువలోనో

ఏ మారుమూల అడవిలోనో
విసిరి వేయ బడతాం
దాఖలా మిగలకుండా బూడిదవుతాం
కొండొకచో బొందలోంచి అదృశ్యమవుతాం

అయినా
మా చావుపుట్టుకలు
జనాభాలెక్కలకు తప్ప
జాతి పురోగతికేం పనికొస్తాయి
దరిద్రం బాధ భరించలేక పుట్టే వాళ్ళం
దరిద్రం బాధ భరించలేక గిట్టే వాళ్ళం
ధర్మానికి గ్లాని జరిగినప్పుడు అవతారమెత్తి
పని ముగియగానే చాలించే
సూత్రధారులు మీరు
అదృష్టవంతులు

1. dejavu - ఇప్పుడున్న పరిస్థితి ఇదివరకే అనుభవించామన్న భ్రాంతి. (ఎద్దుకు కాడివలె- అను) చిరపరిచితమైన, విసుగైన విషయం. నా ఇన్నాళ్ళ మానసిక స్థితికి ఈ మాటను, నేనిన్నాళ్ళుగా చెప్పలేక పోతున్న భావాలకు ఇండియన్ ఎక్స్‌ప్రెస్‌లో లేఖ (సెప్టెంబర్ 17), ఎకనమిక్ అండ్ పొలిటికల్ వీక్లీ (సెప్టెంబరు 6) లో వ్యాసం ద్వారా ఒక రూపాన్నిచ్చిన బాలగోపాల్ గారికి కృతజ్ఞతలు.

2. Shave Merit నుంచి Save Merit.

# శ్యాం సవేరా

నెవిల్

ఏం చేస్తున్నా గాలి పీలుస్తున్నట్లు
ఆ పరిచయం అలలు మనసులో సుడి తిరుగుతూ....

అతడు రాసాడు అది ఆదేశం
అతడు రమ్మన్నాడు అది ఆజ్ఞ
అతడు చర్చించాడు అది ఆమోదం
అతడు చెప్పాడు అది వాస్తవం
అతని చదువు ఆచరణ అతని నాయకత్వం సేవ

పేరు తప్ప అతని గురించి ఏమీ తెలియదు
ఉద్యమం అతని చిరునామా

ఏ తల్లి కన్నదో ఏ తల్లి పెంచిందో
నా వూళ్ళో కన్ను మూసాడు
నా ప్రజల మధ్య పనిచేసాడు
జాతస్య మరణం ధృవం
ఈ జనం మధ్యే మరణిస్తానన్నాడు
నా ఊళ్ళో కొండవలె సరస్సువలె

నా బాల్యంలో కొలిచిన కొండలు అవి
ఇప్పుడక్కడ ఆకంఠం ప్రతిధ్వనిస్తుందా
ఆ సరస్సులో వికసించిన కలువల్ని
కన్నార్పకుండా చూసేవాణ్ణి
ఆ కలువల్లో ఆ రూపం కనిపిస్తుందా

ఆ మట్టిలో అతని స్నేహస్పర్శ
వెచ్చని నెత్తురులా శ్వాసిస్తుందా

# నన్నో మేఘాన్ని కానివ్వండి

విపినకుమార్

నన్నొక మేఘాన్ని కానివ్వండి
నేను మీకోసం కవిత్వాన్ని మోసుకొస్తాను
కవిత్వం నావూపిరిగా మసులుతున్నపుడు
నేను మేఘాన్ని కాక ఏమవుతాను ?

కాలం పోలీసు తూటా ఐనప్పుడు
కాలం జైలు కటకటాల్ని వరించిన
కవి కరాంగుళుల స్పర్శలో రుద్రవీణానాదం ఐనప్పుడు
కాలం సమయ నిర్ధారణలో విరామంలేని పాదమైనప్పుడు
మీరు అంకెల కూడికా తీసివేతా మరచి పోండి
మీరు పదాల అర్ధం మార్చుకోండి
సంధ్యా రక్తిమ పై వాలే ఈగల గుంపును చూడండి
పులిలాంటి శత్రువు వాసన పసిగట్టండి
కాలం కదులుతూ దూరం పెరుగుతున్నపుడు
నన్నొక మేఘాన్ని కానివ్వండి

చెరువొక పోత పోసిన అల్యూమినియపు
ముద్ద అయినప్పుడు
నేను పోలేనిచోట నావాళ్ళున్నప్పుడు
నన్నొక హృదయపు మోత కానివ్వండి
కవిత్వం నారక్తంగా మరుగుతున్నపుడు
నేను హాసపు ఆకాశాన్నవుతాను

ఆకుల కింది నీటి చుక్కలు ఎండకు ఆవిరైనప్పుడు
చెరువూ కొండా నేలా ఆకాశమూ
శబ్దాన్ని ప్రకంపించని డయాఫ్రం ఐనప్పుడు
కాలం కనీనికలో మౌనం ఫోటోగ్రాఫ్ ఐనప్పుడు
నన్నొక భాషను కానివ్వండి
నన్నొక మేఘాన్ని కానివ్వండి

# 'జులూస్'

దర్శన్

"అబ్బ ! ఏం ఎండ ?" అనుకున్నాడు కృష్ణ పాపయ్యపేటచమన్ దగ్గరికి రాగానే. అక్కడ మూడురోడ్లకూడలివుంది. చమన్ ఎన్నడో రూపుమాసి పోయినా పేరింకా అలాగేవుంది. అప్పుడు సమయం తొమ్మిదిన్నర అవుతుంది. సూర్యుడు అప్పుడే మేడలపై నించి తలెత్తాడు. ఐనా ఉక్కగావుంది. సెప్టెంబర్ మాసంలో ఉండాల్సిన చెమ్మ, చలీలేవు. ఉక్కగా వుంది.

అక్కడ ఒకనిమిషం ఆగి జేబులోంచి కర్చీఫ్ తీసి ముఖాన్ని తుడుచుకుని రోడ్డునిదాటి ఎల్లమ్మబజార్ వైపువెళ్ళే సందులోకి దూరాడు కృష్ణ. చేతిలో న్యూస్ పేపర్ చుట్టివున్న వస్తువేదో ఒకమూరెడు పొడుగువుంది. దాన్ని ఆ చేతినుంచి ఈ చేతికి మార్చుకుంటూ రెండోచేత్తో అప్పుడేవస్తున్న నూనూగు మీసాల్ని తడుము కుంటూ పెద్దపెద్ద అంగలు వేస్తూనడుస్తున్నాడు.

మట్టెవాడ హైస్కూలు పక్కనించి నడుస్తూ ఎందుకైనా మంచిదని అతడు పక్కనే వున్న మసీదు సందులోకి తిరిగాడు. అతని అనుమానం నిజమే. సూటిగా వెళితే ఎల్లమ్మ బజారు సారాదుకాణం దగ్గర పోలీసులో వాళ్ళతొత్తులో ఉండితీరుతారు. అతను దారిమార్చి ముస్లిం వీధిలోకి ప్రవేశించటం కొంతనయం. ఆవీధిలో ఇళ్ళన్నీ తలుపులు మూసివుంటాయి. వీధుల్లో జనం ఎవరూ ఉండరు. ఐతే అది ఒకందుకు ప్రమాదం గూడా. ఏ ఇంటి తలుపైనా అకస్మాత్తుగా తెరుచుకుని ఏ పోలీసువాడో ప్రత్యక్షమైతే ? కృష్ణకుడిచేతిలో వున్న వస్తువుని గట్టిగా పట్టుకుని నడుస్తున్నాడు.

అతని తలకిందికేవుంది గానీ చూపులు వెనక్కి తప్ప అన్నిదిక్కుల్నీ కని పెడుతున్నాయి. అతనిచెవులు చీమచిటుకు మన్నా పట్టుకుంటున్నాయి. అప్పుడప్పుడు వెనుదిరిగి చూస్తూ చకచకా అడుగులేస్తున్నాడు.

అతని మనసు ఎంత ఉద్వేగంగా వుందో చెప్పలేం, అతని మనసుఎంత నిమ్మ ళంగా వుందో అదీ చెప్పలేం. ఎవడన్నా వయసుని అంటి పెట్టుకుని సాహసం ఉంటుందంటే వాణ్ణిదొరకబుచ్చుకుని తన్నాలి. కృష్ణ వయసు అతని చర్యలకి ఏ మాత్రమూ చాలదు. ఐనా అతడు తనది సాహసమని అనడు. అది అవసరం అంటాడు.

అతడిప్పుడు నడుస్తూ ఒక విషయం ఆలోచిస్తున్నాడు. గతరాత్రి కాశీపేట మార్కెట్‌లో రాత్రి ఎనిమిది గంటలతర్వాత అకస్మాత్తుగా కోళ్ళన్నీ ఎందుకు అయి

పోయాయో, బార్లలో, బ్రాందీషాపుల్లో ఎందుకు రద్దీపెరిగిందో అని సామాన్యంగా కార్మిక ప్రాంతాల్లో పండగరోజున తప్ప అలా జరుగదు. మరియిన్న ఏం పండగ ? ........

అతడు తనలో తాను నవ్వుకుని కుడిచేతిలో పేపర్ చుట్టి వున్న వస్తువుని ఓసారి ఎగరేసి అందుకుని ఎడంచేత మొలక మీసాల్ని నిమురుకున్నాడు. సందు మూల తిరిగేచోట ఒక చెత్తకుండీవుంది. దాని చుట్టూ పందులగుంపొకటి నిదానంగా పడుకునివుంది.

అతను ఆ గుంపుని అతి జాగ్రత్తగా గంతేసి దాటి మెయిన్ రోడ్డెక్కాడు. అది మహబూబియా పంజెతన్ కాలేజీ. అక్కడ ఒక్క నిమిషం ఆగి రెండుదిక్కులు చూశాడు. ఒకవైపు ఎంచుకుని అటుసాగాడు. ఆరోడ్డు ఎల్లమ్మ బజార్ మార్కెట్ వైపు సాగుతుంది. చాలా రద్దీగా వుంది. ఒకర్నొకరు తోసుకుని పోవాల్సిన రోడ్డు అది.

"కలకత్తా రోడ్లిలాగే వుంటాయేమో !" అనుకుంటూ నడిచాడతను. సోమవారం కావటం వల్ల కాలేజీ పిల్లల రద్దీ, మార్కెట్ జనం రాకపోకలు, సామాన్య జనం-అంతా ఇరుగ్గావుంది. రోడ్ల మీదే కూరగాయలు కుప్పలుగాపోసి అమ్ముతున్నారు. మాంసందుకాణాలు మునిక్కాలవల మీదే పెట్టుకుని కూచున్నారు. ఎండుచేపలు, పచ్చి చేపలు కంపుకొడుతూ వుంటేవాటిని తప్పించుకోటానికి ముక్కు మూసుకుని నడుస్తున్నారు జనం. అంత ఇరుకులోనూ చాయ్‌వాలా దగ్గర నిలబడి టీ తాగుతున్నారు కొందరు.కృష్ణ బాణంలా దూసుకుపోతూ ఆ జనాన్నించి బయటపడి మండీబజార్ వైపు తిరిగాడు.

పొద్దున్నే బయల్దేరాడు గదినుంచి. అప్పటి నుంచీనడకే. విశ్రాంతిలేదు. కనీసం టీ ఐనా తాగలేదు. ఎక్కడికి వెళదామన్నా ముందూ వెనకా ఆలోచించాల్సి వస్తోంది. రాత్రినుంచీ ఊరంతా అట్టుడికి పోతూంది. ఎన్నడూ ఆవూరి చరిత్రలో జరగని విషయం అది.

ఒకపోలీసు యస్సయిని రద్దీగా ఉన్న రైల్వే ప్లాట్‌ఫారం మీద కాల్చి చంపటం మాటలా ? పైగా చంపిన వాళ్లెవరూ దొరకలేదు. ఈ పరిస్థితిలో తనలాంటి వాడు

కనిపిస్తే ఇంకేమన్నా వుందా ? అదేదో తన మీదికి తోసేసి కసితీర్చుకోరూ ? అసలు పోలీసులు ఇప్పుడెంత కోపంగా ఉన్నారో ? ఎవర్ని అరెస్టు చేశారో, ఎవర్ని హింసిస్తున్నారో తెలిస్తే బాగుండును.

అతడు మండీబజారు వేపచెట్టు దగ్గరికి వచ్చేసరికి జనమంతా గగ్గోలు పడుతూ కన్పించారు. అది అసలే మెయిన్‌రోడ్డు కావటం వల్ల గోలగావుంది. రోడ్డెక్కదామను కున్న వాడల్లా ఆగిపోయాడు. ఎందుకైనా మంచిదని పక్కనే వున్న పాకల హోటలు వైపు నడిచి సింగిల్ టీకి ఆర్డరిచ్చి ఓ పక్కగా నిలబడ్డాడు. అతనికి ఎడమ పక్కగా రిక్షాలవాళ్లు రిక్షాలు ఆపుకుని టీలు తాగుతూ చెప్పుకుంటున్నారు.

"అబ్బ ఎంత పెద్ద జులుస్ అనుకున్నవు ? ఉర్లె ఉన్న పోలీసులంత ఆ ఊరేగింపుల్నే ఉన్నరు. ముందట ఎస్పీ, డీ ఎస్పీ నడుస్తాంటె వాళ్ల ఎనుక వ్యాను మీద సచ్చినోని పీనుగ బెట్టిన్రు. దానికి దండలు గిండలు ఏసి ఇంతకుంకుమ జల్లిన్రు. జై జై అంటాన్రు" అన్నాడొకతను.

"నీయవ్వ ! వీడు సరీగ ఇనలేదురా. మాయన్నయిని జంపిన రాడికల్సును నాశనం జేస్తం. ఓ ప్రజలారా సూడున్రి రాడికల్సు దౌర్జన్యం దీనికి మీరే సాక్షం అనుకుంట లొల్లి బెట్టిన్రు" ఇంకొకతను సరిదిద్దాడు.

"కని ఈ పోలీసులు జులుస్ దీసుడేందిరా ! గమ్మతుగున్నది. మనవూరు ఏమయి పోతాందో అర్థమైతలేదురా వారీ !" ఒక ముసలతను అన్నాడు.

ఇంతలో హోటలువాడు కృష్ణకి టీ అందించాడు. అతడు టీ తాగుతూ వారి మాటలు వింటున్నాడు. వాళ్లు చెప్పుకునేది వింటే అతని గుండెలు వేగంగా కొట్టుకున్నాయి.

"అసలు ఆ పోలీసోన్ని ఎవరు జంపిన్రట ?"

"ఎవరేంది ? రాడికల్సేనట గదా ! వాల్లకూ వీల్లకూ పడదు. వాల్లను వీల్లు జంపుతరు. వీల్లను వాల్లు జంపుతరు."

"అనుకునుడేగని రాడికలోల్లు పోలీసుల నెప్పుడు జంపిరి ? రాడికలోల్లనే పోలీసులు శానమందిని సంపి అవుతల పారేశిన్రు. మొన్న మొన్న సుదర్శన్ అనెటోన్ని, సారంగపాణి అనెటోన్ని కొట్టి సంపలేదా ? అప్పట్నుంచి వాల్లు పగబట్టిన్రిట."

"మరి ఎంతకని ఊకుంటరు ? ఏదన్న ఉంటె తిట్టాలె కొట్టాలె జేల్లి పారెయ్యాలె గని సంపుడేనా ?"

ఇంతలో ఒక రిక్షా అతను వేగంగా రిక్షాతొక్కుకుంటూ వచ్చాడు. ఒక్క ఊపున రిక్షాను ఆపి పరిగెత్తుకుంటూ వచ్చాడు.

"అరేయి ఇన్నార్రా ఎంత కత్తైందో !" అన్నాడు ఎగపోస్తూ.

"ఏందిరా ఏమయింది ?"

"మన డాక్టరుసాబును పోలీసులు సంపేశిన్రు. ఇప్పుడే ఐంది."

"ఎహె ! నిజంగనా ?" అక్కడున్న వాళ్లంతా ఆశ్చర్యపోయారు. వాళ్లకది నమ్మశక్యం కాలేదు.

"నిజమేరా ! నేను అక్కన్నే అడ్డమీద ఉంటిగద. జులుస్ వస్తాంటె కొంత మందివచ్చి మమ్ములందర్ని అడ్డమీది నుంచి రిక్షాలన్ని తీసెయ్యిమన్నరు. పోలీసుల తోటి లొల్లి ఏందని అందరం అక్కన్నుంచి అటేటు పొయినం. కొద్దిగ దూరం పొయినం గని మాకంత కనబడ్తనే ఉన్నది."

చెపుతున్న వాడికి ఏడుపే తక్కువగా ఉంది. వింటున్న కృష్ణ గుండెలు గుబగుబలాడాయి. అతని కళ్లముందు చీకటి కమ్మినట్టయింది. నిలబడలేక అక్కడ బెంచీమీద కూలబడ్డాడు. అంతవరకూ ఫ్రీగా మాట్లాడు కుంటున్న రిక్షావాళ్ల గొంతులు దగ్గర పడ్డట్టుగా మౌనం వహించారు. వారిముఖాల్లో భయం తాండవించింది. ఒకరి మొహాలొకరు చూసుకున్నారు. కృష్ణకి టీ తాగబుద్ధి కాలేదు. గ్లాసును టేబులు మీద పెట్టేశాడు.

వీళ్ళు చెప్పుకుంటున్న విషయం నిజమేనా ? వివరాలు తెలుసుకోవటం ఎలా ? అతనికే మార్గమూతోచలేదు. పట్టరాని ఉద్వేగంతో అతని శరీరం కంపించింది. ఏదో గ్రహణం సంభవించి ఆకాశంలో సూర్యుడు మాయమైనట్టు తోచింది. చెవులకు ఏదో మహాశిలాపాతాల ధ్వని వినిపించినట్టుగా తోచింది. క్షణంలో ఒక నిర్ణయానికి వచ్చాడు. లేచి టీడబ్బులు చెల్లించి ట్రిగర్ విడిచినతూటా ఎల్లమ్మబజార్ సందులోపడి దూసుకు పోయాడు. జ్వరం వచ్చిన వాడిలా వున్నాడతను. అతని శరీరం శ్వాసిస్తోందో లేదో తెలియదు. అతనిలో రక్తం పారుతోందో పొర్లుతోందో తెలియదు.

రెండే రెండు నిమిషాల్లో దుర్గేశ్వరస్వామి గుడిసందులోంచి డాక్టరుగారి ఆస్ప త్రిని చేరాడు. అక్కడంతా జనం గుమికూడి ఉన్నారు. ఎవరి ముఖంలో చూసినా భయం, మృత్యువు పరిచిన నల్లని ఛాయలు ఉన్నాయి. గొంతు విప్పి ఎవరూ మాట్లాడ టంలేదు. రాత్రింబగళ్లు ట్రాఫిక్ ఆగని ఆ రోడ్డుమీద జనంతో పాటు కాలంగూడా స్తంభించి పోయింది. డాక్టరుగారి ఆస్పత్రి తలుపులు మూసి ఉన్నాయి. ఆస్పత్రి ముందు ఎవరూ జనంలేరు. అవతలి పక్క బస్‌స్టాప్‌లోనూ, ఎదురుగా బ్యాంకులోనూ పెట్రోలు పంపు దగ్గరా దూరంగా కిళ్ళీకొట్ల దగ్గిరా జనం తమతమ పనుల మీద ఉన్నట్టుగా ఉన్నారు.

ఆస్పత్రివైపు ఎవరూ చూడటంలేదు. కానీ అందరి చెవులూ, కళ్ళూ ఆస్ప త్రినే గమనిస్తున్నాయి. కృష్ణకూడా ఏమీతోచక ఒక కిళ్ళీకొట్టు దగ్గిరికి చేరాడు. అల వాటున్నవాడిలాగా ఒక సిగరెట్టు ముట్టించి తాగుతున్నట్టు నటిస్తూనిలబడ్డాడు. ఆ కిళ్ళీ కొట్టు దగ్గర పది మంది దాకా ఉన్నా ఎవరూఏమీ మాట్లాడటంలేదు. కృష్ణ మనస్సు ఉద్వేగంతో ఊగిపోతోంది. అతనిలో ఉత్సుకత ఆగటంలేదు. సిగరెటు పీలుస్తున్న అతని వేళ్ళు వణుకుతున్నాయి. ఆందోళనని అణుచుకునే ప్రయత్నంలో అతడు ఉన్నాడు. కానీ నిశ్శబ్దమైన రోడ్డు ఆ ప్రయత్నాన్ని సఫలం కానివ్వటంలేదు. పజిల్ ముందు పెట్టుకుని కూచున్నవాడిలా ఉన్నాడు కృష్ణ. అతనికి ఏమీ అర్థం కావటంలేదు. ఆసమయంలో దూరంనించి వస్తూ రాజయ్య కన్పించాడు. అతన్ని ఎలా పిలుద్దామా అని కృష్ణ ఆలోచిస్తుండగానే రాజయ్య అతన్నిచూశాడు. చూసి చూడనట్టుగా నటిస్తూ రాజయ్య అతనిదగ్గరిగా వచ్చాడు. కిళ్ళీకొట్లో ఒక సిగరెట్టు కొనుక్కుని తానుగూడా పీలుస్తూ కృష్ణ పక్క నిలబడ్డాడు.

కృష్ణ అతణ్ని ఓరకంట చూశాడు. రాజయ్య అది గమనించి "ఎంత ఘోరం" అన్నాడు అతనితో. కృష్ణకి డాక్టరుగారి హత్య నిజమే అని అర్థమైపోయింది. అతని కాళ్ళు గజగజలాడాయి. నిలబడలేక పక్కనే వున్న పోస్టుడబ్బాని ఆనుకొన్నాడు. అతని చేతిలోని సిగరెట్టు జారి పోయింది. రాజయ్య అతనికిసైగ చేసి పక్కనేవున్న బ్యాంకు లోకి దారితీశాడు. కృష్ణ అతణ్ని అనుసరించాడు.

• • • • •

ఆ ఉదయం ఒక రాకాసి నీడలాగా ఊరిమీద పరుచుకుంది. ఆకాశంమీద బూడిద రంగు చారలు మేఘాలుగా ఆక్రమించుకున్నాయి ఆ చారలు దగ్గిరౌతూ గాఢంగా, గట్టిగా, ఒక విషకుంభంలాగా ఊరిమీదకి జారాయి.

అప్పుడు సరిగ్గా సమయం ఉదయం తొమ్మిది గంటల పదినిమిషాలు. ఆ సమయంలో చీమకూడా నడవ సందు లేనంత రష్‌లో ఆ రోడుమీద ఒక వూరేగింపు. అది అల్లాటప్పయ్యేది కాదు- తీవ్రవాదుల చేతుల్లో హతం చేయబడ్డ ఒక యస్సయి శవం వూరేగింపు. ఆ వూరేగింపు రెండుగజాల వెడల్పుతో ఫర్లాంగు పొడవుతో వుంది. దాని మొదలు డాక్టరుగారి ఆస్పత్రి దగ్గిర వుండే కొన లక్ష్మీటాకీసు దగ్గిర వుంది. ఊరేగింపులో రెండువ్యాన్లూ, ఒక జీపూ, చివరా మొదటా మరో రెండు వైర్లెస్ జీపులూ వున్నాయి. ఆ వూరేగింపులోని జనమంతా యూనిఫారంలో వున్నారు. అంచేతఅందరూపోలీసులే అన్నది నిశ్చయం. ఐతేఆవూరేగింపుకినాయకత్వం వహించిన ఎస్పీ, డీఎస్పీలు ముందు నడుస్తూంటే కొందరు పోలీసుఆఫీసర్లు వాళ్ళని అనుసరిస్తున్నారు. వాళ్లలో కొందరు మఫ్టీలో ఉన్నారు. ఐతే ఊరేగింపులో పాల్గొన్న ప్రతీ అనామకుడు అయుధ ధారే అన్నది వేరేచెప్పాల్సిన పనిలేదు.

ఊరేగింపు డాక్టరుగారి ఆస్పత్రిని చేరేముందే ఆస్పత్రిదగ్గరున్న రిక్షాలన్నిటినీ ఎవరో తరిమేశారు. డాక్టరుగారి ఆస్పత్రికి వెనుక ఒక సందువుంది. మెయిన్ రోడ్ మీద వున్నదుకాణాలన్నిటికీ వెనుక దర్వాజాలు ఆసందులోకే వుంటాయి. అలాగే ఆస్పత్రి వెనుక దర్వాజాగూడా.

శవం వూరేగింపు ఇంకా ఆస్పత్రిదాకా రాకముందే కాంపౌండరు వచ్చి డాక్టర్ని హెచ్చరించాడు.

"సార్ ! పోలీసులు ఊరేగింపుగా వస్తున్నారు. ఆసుపత్రి మూసేద్దామా ?"

పేషెంటుని పరీక్షిస్తున్న డాక్టరు తలెత్తాడు. అతని మొహంమీద ఎన్నడూ చెరగని చిరునవ్వుతో అన్నాడు. "పోలీసులు వస్తే మనకేమిటయ్యా ! వాళ్లు మనల్నే ...ంటారు ?"

కాంపౌండరు తటపటాయించాడు. "అదికాదు సార్ ! చాలామంది ఉన్నారు. పైగా ఊరేగింపుచూసి షాపులన్నీ మూసేస్తున్నారు. మనం గూడా మూసేస్తే మంచిది" అన్నాడు.

"సరే, ఇప్పుడు లోప లున్న పేషంట్లని మాత్రం ఉంచి తలుపులు వేసెయ్యి. వీళ్లని చూసి పంపెయ్యాలిగదా !" డాక్టరు అనటంతో కాంపౌండర్ బయటికి వెళ్లి పోయాడు.

రెండు గదుల క్లినిక్ అది. ముందుగది వెయిటింగ్‌రూం గానూ రెండోగది కన్సల్టింగ్ రూంగానూ ఉంది. పరీక్ష చేయించుకున్నతర్వాత రోగులు వెనక గుమ్మం నించో లేక పక్కనేవున్న వరాండాలోంచో బయటికి వెళ్లి పోతారు.

ముందుగదిలో కిట కిట లాడుతూ ముప్పై నలభై మంది పేషెంట్లు ఉన్నారు. ఆ గదంతా పిల్లల కేకలు, ఏడ్పులతో మారు మోగి పోతోంది. పేషెంట్లు కొందరు కాలంగడవటం కోసం ఒకళ్లతో ఒకళ్లు కబుర్లు చెప్పుకుంటున్నారు.

"ఏవూరు మీది ?" ఒకావిడ పక్కనున్నావిడ నడిగింది. ఆమె ఒడిలో చిన్న పిల్లాడొకడు చిక్కిశల్యమైనట్టుగా ఉన్నాడు. ఆవిడ పక్కన భర్తకాబోలు కూచున్నాడు.

"బెల్లంపల్లి. " రెండో ఆమె జవాబిచ్చింది. ఆమెఒడిలో గూడా ఒక పిల్లా డున్నాడు. "అబ్బో ! అంతదూరంనుంచి వచ్చిన్రా ? ఏమైంది పిలగానికి ?"

"ఒకటే వాంతులు విరేచనాలు. పదిరోజులైంది. ఎందరు డాక్టర్లకు చూపెట్టినా తగ్గలేదు. ఎవరో చెప్పిన్రు, ఓరంగల్లుల ఈ డాక్టరుకు సూపెడితె పోద్దంటె వచ్చినం".

"అవు నిజమే చెప్పిన్రు, మాదిగూడ ఈవూరుకాదు హుస్నాబాద. మాపోర గాడు రొండునెల్లాయె. తిండితింటలేడు. రోజురోజుకు బక్కగైతాండు. ఎంతకర్చు బెట్టినా పైసలపోవ్వ పైసలదే మందు పోవ్వ మందుదే. మనిషి మీద ఆశ వదులు కున్నం. ఈ డాక్టరు చెయ్యిబెడితె సాలు లేశి తిరుగుతడంటె ఆకరు ప్రయత్నం ఈడికి వచ్చినం"

ఇంతలో బయట ఊరేగింపు గోలవిన వచ్చింది. పేషెంట్లలో కొందరు మగ వాళ్లు లేచి బయటికి వెళ్లారు.

"ఏందట లొల్లి ?" ఒకతను పక్కనున్నతనితో అన్నాడు.

"అరె ! గిదేందిరో ? పోలీసులే ఊరేగింపు దీశిన్రు ?"

ఊరేగింపు క్లినిక్ ముందుకు వస్తుంటే లోపల్నించి కాంపౌండరు వచ్చాడు. "లోపలికి రాండి. తలుపులు వేస్తున్నం. అందరు లోపలికి రాండి. "అన్నాడు. బయట వున్న వాళ్లంతా లోపలికి రాగానే తలుపులు వేసేశాడు. ఇంతలో ఊరేగింపు వచ్చి

క్లినిక్ ముందు ఆగింది. యస్సయి శవాన్ని ఉంచిన వాహనాన్ని క్లినిక్ ముందు ఆపారు.

"ప్రాణానికి ప్రాణం, రాడికల్స్ ! ఇక మీకు మూడింది జాగ్రత్త, ప్రజలారా రాడికల్స్ దౌర్జన్యం చూడండి " అని నినాదాలిస్తున్నారు. కాంపౌండరు ఆవూరేగింపు చూద్దామని పక్క తలుపు తెరుచుకుని మేడమెట్లు ఎక్కిపైన బాల్కనీలో నిలబడ్డాడు. లోపల గదిలో డాక్టరు మామూలుగా పేషెంట్లని పరిశీలిస్తున్నాడు. బయట నిలబడ్డ ఊరేగింపులోని నినాదాలు అతని చెవులకి లీలగా సోకుతున్నాయి. వాటిని పట్టించుకోకుండా అతడు రోగుల్ని పరీక్షిస్తున్నాడు.

"ఏమైందమ్మా పాపకి ?" తల్లిని ప్రశ్నించాడు అతడు.

"రాత్రి నుంచీ జ్వరమండీ !" ఆమె జవాబిచ్చింది. అలా ముగ్గురు నలుగురు పేషెంట్లని చూసి పంపే శాక బేసిన్‌లో చెయ్యికడుక్కుందామని వెనక్కి వచ్చిన అతడు ఒక్కసారిగా ఉలిక్కి పడ్డాడు. ఊరేగింపు తన క్లినిక్ ముందే నిలిచిపోయింది. పదినిమిషాలయినా కదలటంలేదే ? అతని మనస్సు కీడుని శంకించింది.

గబగబ చేయి కడుక్కుని టవల్‌తో తుడుచుకున్నాడు. ముందుగది తలుపు తెరచి పేషెంట్లు ఎంతమంది ఉన్నారో చూశాడు. చాలామందే ఉన్నారు. "మీరంతా కాస్సేపాగండి. తర్వాత చూస్తాను" అని వాళ్ళతో చెప్పాడు. మళ్ళీ తలుపు దగ్గిరగా వేసి బోల్టు బిగించాడు. టేబిల్ మీదున్న కళ్ళద్దాలు తీసితుడుచుకుంటూ వుండగా అకస్మాత్తుగా నీడలు కమ్మినట్టయింది. తల ఎత్తిచూస్తే వెనక గుమ్మంలోంచి నలుగురు వ్యక్తులు వస్తూకన్పించారు. నలుగురి మొహాల్లోనూ భయంకరమైన కసి వెలుగుతోంది. మామూలు దుస్తులు ధరించి వున్నప్పటికీ వాళ్ల సివిలియన్స్ అయివుండరని వాళ్ళ మొహాలే చెబుతున్నాయి. ఇద్దరువ్యక్తులు ఆరడుగుల ఎత్తుతో ఎత్తుకు తగ్గలావుగో బుంగమీసాలతో ఉన్నారు. మూడో వ్యక్తి ఎత్తుగానేవున్నా అడ్డ బలుపు ఎక్కువగా ఉండటంతో కొంచెం పొట్టిగా కన్పిస్తున్నాడు. అతని మొహం నున్నగా వుంది. పెద్దపొట్ట నాలుగో అతను ఎత్తుగావున్నా సన్నగా వున్నాడు. అతని మొహంలో ఎవర్నీనమ్మని కుక్కతనం కనిపిస్తోంది. వాళ్ళు దూకుడుగా డాక్టరు కేసి అడుగులేశారు.

డాక్టరు ఒక్కసారి అదిరిపడ్డాడు. "ఏమిటిది? ఎవరు మీరు ?" అంటూ వాళ్ళను నెట్టుకుని బయటికి వచ్చే ప్రయత్నం చేశాడు. వాళ్ళు అతణ్ణి వెనక్కితోశారు. ఆతోపు

డుకి డాక్టరు టేబిల్ మీదికి తూలాడు. చేతిలోని అద్దాలు కింద పడ్డాయి. పరిస్థితి విష మిస్తోందని గ్రహించాడు. లేచి వాళ్ళని తోసుకుని గుమ్మంలోంచి బయటికి పరుగు తీశాడు.

డాక్టరు తోసిన తోపుకి ఆ నలుగురూ వెనక్కి తూలారు. అద్దాల బీరువాలు పగిలి మందుల సీసాలు కిందపడ్డాయి. వాటిని కసాపిసా తొక్కుతూ బయటికి పరిగెత్తారు. గుమ్మంలోంచి బయటికి వచ్చిన డాక్టరు తోచిన దిక్కుకి పరిగెత్తాడు. ఏషాపన్నా వెనకనించి తీసి ఉంటుందేమోనని చూశాడు. అన్నిటి తలుపులు మూసి ఉన్నాయి. వెనక్కి తిరిగి చూస్తే నలుగురూ వేటకుక్కల్లా పరిగెత్తుకొస్తున్నారు. వెనక్కి చూస్తూ ముందుకి పరిగెత్తటం వల్ల జారి మురిక్కాలవలో పడ్డాడు. పిక్కకి దెబ్బతాకింది. పాంటు మీద మురికి నీళ్ళు చిందాయి. అరక్షణంలో లేచి ముందుకి పరిగెత్తాడు. కనిపించిన తలుపునల్లా తట్టాడు. ఎవరూ తియ్యలేదు. అసలెవరికీ వినపడలేదు. ఒక తలుపుతీసి కన్పించింది. చటుక్కున లోపలికి దూరాడు. అతని వెనకే ఆ నాలుగు వేటకుక్కలు గూడా దూరాయి. అతనులోపలికి ఐదారు అడుగులన్నా వెయ్యక ముందే ఆ నలుగుర్లో ఒకడు రివాల్వర్ తీశాడు.

డాక్టరు కళ్లు పెడల్పయ్యాయి. "వద్దు నన్ను చంపవద్దు. పొరపడుతున్నారు" అని అరిచాడు. సైలెన్సర్ ఉన్న రివాల్వర్ పళ్ళు బిగించి 'టుప్ - టుప్' మని జవాబిచ్చింది. డాక్టరు గారి పొట్టలోనికి, మెదడులోకి బులెట్లు దూరాయి. ఆయన స్పృహకోల్పోతూ నేలకొరిగాడు. నలుగురు వ్యక్తులూ వచ్చిన పని పూర్తి కావటంతో వెనక్కి తిరిగి పారిపొయ్యారు.

షాపు ముందు నిలబడి ఊరేగింపుని చూస్తున్న వ్యక్తులు తమ షాపు వెనక గదిలో గోల ఏమిటా అని వచ్చేసరికి డాక్టరు గారు రక్తపుమడుగులో దొర్లుతున్నారు. వాళ్ళు భయంగా అరుస్తూ డాక్టరుగారి కాంపౌండర్‌ని పిలవటానికి పరిగెత్తారు ఊరేగింపు అప్పటికే కదిలి వెళ్ళిపోయింది.

గొల్లున ఏడుస్తూ అందరూ డాక్టరుగారి చుట్టూ చేరారు. రక్తంలో తడిసిన అతని శరీరం మంకెన పువ్వులా తయారైంది. వేలాది మంది పిల్లల ప్రాణాలు అవలీలగా కాపాడిన వాడు తన ప్రాణాలు నిలుపుకోవటానికి శతథాప్రయత్నిస్తున్నాడు. కానీ డాక్టరు కావటం వల్ల తానిక బతకనని తెలిసిపోయింది. ఐనా తక్షణ సాయం అందితే బతకవచ్చు.

"నన్ను తొందరగా గాంధీ ఆస్పత్రికి తీసుకుపోండి !" అస్పష్టంగా అన్నాడు. ఐనా అక్కడివారికి అర్థమైంది. కొంచెం దూరంలోవున్న మరో డాక్టర్‌ని కారు అడగటానికి ఒకరిద్దరు పరిగెత్తారు. వాళ్ళు వచ్చేలోపల డాక్టర్‌గారి స్థితి మరింత క్షీణించింది. అసలే ఆయన డయాబిటిస్ రోగి. రక్త స్రావం ఆగటం లేదు. "మా ఆవిణ్ణీ, అబ్బాయినీ పిలిపించండి" మగతలోనే అన్నాడు డాక్టర్. మరో పదిహేను నిమిషాల తర్వాత గాంధీ ఆస్పత్రిలో అతణ్ని పరిశీలించిన డాక్టర్లు డాక్టర్ గారు మరణించాడని చెప్పారు.

* * *

ఆ రోజు నగర వాసులకు ఒక పీడకల. పొద్దున్నే లేచి పేపర్లలో యస్సయి హత్యని చదివి విభ్రాంతులై ఇంకా తేరుకోకముందే డాక్టరు గారి హత్య ! ఊరంతా నిర్ఘాంతపోయింది. అంత మంచి మనిషిని, అందరికీ అవసరమున్న మనిషిని ఎందుకు హత్య చేశారు ? ఇరవైఏళ్ళ నుంచి ఊరందరి నోళ్ళలో నానుతున్న పేరు ఈరోజుతో మాసిపోతుందా ?

రాజయ్య చెప్పిందంతావిన్న కృష్ణ మెదడు స్తంభించిపోయింది. అతని చేతిలో ఉన్న వస్తువు మీద పిడికిలి బిగుసుకుంది.

"ఈ హత్య చేసిందెవరో కాదు పోలీసులే !" అన్నాడు రాజయ్యతో. రాజయ్య కృష్ణ మొహం చూసి భయపడ్డాడు. అతనికి ఎన్నడూ చూడని మనిషి అతనిలో కన్పించాడు.

"అవును. అందరూ అదే అనుకుంటున్నారు !" రాజయ్య అన్నాడు.

"సరే ! ఇకనువ్వు వెళ్లు ! ఇక్కడ ఎక్కువసేపుండటం మంచిది కాదు" కృష్ణ కదిలాడు. రాజయ్య అతన్ని జాగ్రత్తగా ఉండమని చెప్పి వెళ్ళిపోయాడు.

కృష్ణ పిచ్చికోపంతో మెయిన్ రోడ్డు మీదనించే నడకసాగించాడు. ఎవడన్నా ఎదురైతే యమలోకానికి పంపేటట్టుగా నడుస్తున్నాడు. రోడ్డుకి రెండు పక్కలా షాపు లన్నీ మూసేసి ఉన్నాయి. అసలు రోడ్ల మీద నడవటానికి గూడా ప్రజలు భయపడు తున్నారు. అందరి మొఖాల్లోనూ భయం, సందేహం తాండవిస్తున్నాయి. అందరూ

ఏదో పనులు చేస్తున్నట్టుగా ఉన్నారేగానీ ఎవరి మనసూ మనసులో లేదు. అందరి దృష్టీ డాక్టరు గారి ఇంటివైపే.

కృష్ణ డాక్టరు గారి ఇంటిని చేరుకునే సరికి అక్కడికి అందరూ వచ్చి చేరు తున్నారు. అతను కొట్టుకుంటున్న గుండెలతో గేట్లో అడుగు పెట్టాడు. ఇంటి ముందు కొబ్బరి చెట్టు స్తంభించిపోయినట్టుగావుంది. ఇంటి కిటికీల మీదికి పాకిన తీగలన్నీ వాడి నల్లబడ్డాయి. ఇంటి ముందు గుమిగూడుతున్న జనంలో విషాదం, కోపం మిళితమై కన్పిస్తున్నాయి. ఒకరిద్దరు మనుషులు ఏడుస్తున్నారు. కొందరు ఇతర్లని అడిగి విషయం తెలుసు కుంటున్నారు. అక్కడ కాలం - స్థలం స్తంభించి పోయాయి.

లోపలికి వచ్చిన కృష్ణకి ఇంటిముందు గోపాల్ కన్పించడంతో వెళ్ళి అతని భుజం మీద చెయ్యి వేశాడు. గోపాల్ తలవంచుకున్న వాడల్లా తలెత్తి చూచి ఏడుస్తూ అతని భుజం మీద తలవాల్చాడు. ములక్కాడలాంటి అతని దుర్బల శరీరం దుఃఖ భారంతో గజగజలాడింది.

కృష్ణ అతని భుజం మీద అనునయంగా నిమిరాడు, "ఎందుకయ్యా దుఃఖం ? అన్నీ తెలిసీ ఎందుకేడుస్తావు ?" అన్నాడు.

"ఇంత అవుతుందనుకోలేదు." దుఃఖం తెరలు గోపాల్ ఊపిరి తిత్తుల్ని గురగురమని పించాయి.

"ఎవరు మాత్రం ఎలా అనుకుంటారు? ఈవూరిలో నూనూగుమీసాలు వస్తున్న ప్రతీయువకుడూ ఎప్పుడో ఒకప్పుడు ఆయన చేత ప్రాణాలు కాపాడబడ్డవాడే. ఆయన చికిత్స చెయ్యని శిశువులు ఇరవైఏళ్ళ నుంచీ ఈ ఊళ్ళో ఎవరూ లేరు. ఆఖరుకు తనని చంపిన పోలీసుల పిల్లల్ని కూడా ఆయన ఎన్నోసార్లు మృత్యుముఖం నించి తప్పించాడు. అలాంటి వాణ్ని ఎవరైనా చంపుతారని ఎవరన్నా అసలెలా ఊహిస్తారు?" కృష్ణ అన్నాడు.

ఇంతలో గేటులోంచి సైకిలు తొక్కుకుంటూ బాజీరావు వచ్చాడు. వస్తూనే అతడు సైకిలు అటువైపు పడేసి కృష్ణనీ, గోపాల్‌నీ కావిలించుకుని ఏడ్చాడు. "ఎంత పని చేశారయ్యా లంజ కొడుకులు !" అని కళ్ళుతుడుచుకుని "బాడీ ఎప్పుడిస్తారట ?" అనడిగాడు.

"రేపిస్తారట" అప్పుడే అక్కడికి వచ్చిన పత్రికా విలేఖరి ఒకాయన అన్నాడు.

*　　*　　*

ఎక్కడినుండి వచ్చాయో పాడు మబ్బులు. ఉదయంనుంచీ ఊరిమీద వాలి జల్లుగా కురిసి చీకాకు పెడుతున్నాయి. ఊరు గుండెలో గూడుకట్టుకున్న భయం, విషాదం కరిగిపోవటానికి సూర్యోదయం ఇంకా కాలేదు. డాక్టరు గారి ఇంటి ముందు పూరిజనం ఆయన అంతిమ దర్శనం కోసం బారులు తీరారు. మొదట పదులు, తర్వాత వందలు వేలల్లోకి మారింది సంఖ్య. యాభై రెండేళ్ల యువకుడు. ఎన్నడూ నవ్వుచెరగని మొహం. విశ్వాసం సడలని నుదురు. అనుభవం పండిన జుత్తు. మనుషుల మీద అచంచలమైన ప్రేమ, విశ్వాసం కలబోసుకున్న అంతరంగం. ఆయన డాక్టరు, ఆయన మిత్రుడు. ఆయన మనిషి. కొబ్బరి బోదెను ఆనుకుని కృష్ణ ఆలోచిస్తున్నాడు.

తుంపర మొదలై వర్షంగా మారింది. ఒక్కొక్కరూ రావటం మొదలై జన ప్రవాహమైంది. ఊరంతా అక్కడే వుంది. ప్రభుత్వం సైతం అక్కడే వుంది. ఆర్డీవో వచ్చిచూసి వెళ్ళాడు. పోలీసులు చుట్టూ మోహరించారు. వాతావరణంలో గంభీరత మనసుల్లోనూ వుంది.

తాత్కాలికంగా అమర్చిన వేదికమీద డాక్టరుగారి భౌతికకాయాన్ని ఉంచారు. తల్లికోసం ఎదురుచూస్తున్నారు. జనంలో కలకలం మొదలైంది. పోలీసు అధికారి ఒకడు డాక్టరు గారి శవాన్ని సమీపించాడు. జనంతోపాటు తానూ దర్శనం చేసు కున్నట్టు నటించాడు. టోపీతీసి చేత పట్టుకున్నాడు. క్షణం తర్వాత మళ్ళీ ధరించాడు. పక్కకి జరిగి అక్కడున్న ఒక పెద్దమనిషితో అన్నాడు.

"త్వరగా కార్యక్రమం కానిస్తేమంచిది. ఆలస్యమవుతున్న కొద్దీ పరిస్థితులు మారుతాయి."

వింటున్న కృష్ణ పళ్లుకొరికాడు. బతుకూ వీడిష్టమే చావూ వీడిష్టమేనా ? ఇంతలో పెద్దమనిషి అన్నాడు. "రావాల్సిన వాళ్లందరూ రాలేదండీ ? వచ్చాక అలాగే జరుగుతుంది."

పోలీసు అధికారి నిట్టూర్చాడు. "వచ్చిన వాళ్లు ఏం చేశారని ఇకరాబోయే వాళ్లు వచ్చి చేసేదేముంది ? మనిషే పోయాక ఎవరు వచ్చి ఏంలాభం ?" వేదాంతం మాట్లాడాడు.

కృష్ణకు దుఃఖం పొర్లింది. ఐనా కళ్ళ వెంట నీటిచుక్క రాలేదు. కన్నీరు ఇగిరి దుఃఖం గుండెని నలిపేస్తోంది. ఎదురుగా రాజారావు, బాజీరావు గుండెలు అవిసేట్టుగా ఏడుస్తున్నారు.

డాక్టరుగారి అంతిమ దర్శనం కోసం వచ్చే జనాన్ని భయపెట్టటం కోసం సందు మూలల మీద పోలీసులు జీపుల్నీ, వ్యాన్లనీ నిలబెట్టారు. తుపాకులు చంక నేసుకుని వీధిఅంతా పహరా ఇచ్చారు. జనం భయపడలేదు. రావటం మానలేదు.

బాజీరావు కళ్లతుడుచుకుంటూ కృష్ణ దగ్గరికి వచ్చాడు, "ఊరు తగలబడి పోతుందని అందరూ అనుకుంటున్నారు" అన్నాడు.

"ఎవరు తగలబెడతారు ?"

"డాక్టరుగారి హత్యకు ప్రతీకారంగా రాడికల్స్ ఆపనిచేస్తారని అనుకుంటు న్నారు"

కృష్ణనవ్వాడు. "ఇది పోలీసులు సృష్టించిన కట్టుకథే అయివుంటుంది. ఆ వుద్దే శమేవుంటే ఇరవై నాలుగ్గంటలు ఆగుతారా ?" అన్నాడు.

'ఊరు ఉనికిని మరిచింది. మనుషులు నిద్రని మరిచారు. అరే ! ధర్మరక్షణకు నీకునీవే పూనుకున్న దురహంకారీ! నీకుతెల్ల వారింది గమనించు. దురన్యాయపూరితుడ వై దురాగ్రహంతో అంధుడవై నువు బరితెగించి, కత్తితో, దోపిడీతో ఎడారి హైనావలె జనంమీద విరుచుకు పడ్డావు. నీచేత గల కత్తి రక్తదాహంగల రేచుకుక్క నాలిక. ఇప్పుడు నువు కుక్కవు. ఇక నీగతి అధోగతి' — అనుకుంటున్నాడొక భావుకుడు,

'బిడ్డా ! నువునాకు పితృత్వం కలిగించిన క్షణాన్ని నేను మరచిపోలేను. కానీ నాపితృత్వాన్ని కాపాడిన మనిషిని గూడా మరిచిపోలేను. నువు ఆరోగ్యంగా, చైతన్య వంతంగా ఉన్నది కొద్దిరోజులే. కాని తర్వాత నువునాకిచ్చిన ఆనందంకన్న దుఃఖమే ఎక్కువ. కానీ నీవయసు ఈనాడు ఇరవైఏళ్లు. నిన్ను మృత్యువు నోటిలోంచి చిటికెన వేలితో బయటికి లాగిన ఆ మనిషి ఈనాడు....' అనిపలవరిస్తున్నాడొక తండ్రి.

'నా బిడ్డను కాపాడితివి. నీ ప్రాణం చూసుకోలేకపోతివా ? వాళ్ళ బిడ్డల్ని నీ దగ్గర బతికించుకున్నారు. నిన్నే చేతులారా చంపేశారా ? మేమంతా నీ మనుషులమే. నిన్నుకాపాడుకోలేక పోతిమే. ఊరంతా నీ బిడ్డలే. మా బిడ్డలందరికీ నువుపోసిన ఊపిరే. ఇప్పుడెవరూ మా బిడ్డలకు దిక్కు ? నీలాంటి వాడెవడున్నాడు ? అసలు న్నాడా ? అసలుంటాడా?' అని ఘోషిస్తోందొక తల్లి.

• • • • •

రెండు రోజుల్నించీ ఊరు మొత్తం స్తబ్దంగా వుంది. ఎవరు చెప్పకున్నా జనం బంద్ పాటించారు. ఇంటిచుట్టూ దిట్టంగా పోలీసు బందోబస్తు, పైగా సీక్రెట్ ఏజెంట్ల హడావిడీ ఉన్నప్పటికీ ఆయన భౌతికకాయాన్ని దర్శించని పురజనుడులేడు.

కంటతడి పెట్టని లక్ష్మీకొడుకులేడు. ఆకాశంగూడా తనవంతుగా అరగంటసేపు జల్లు కురిసింది.

ఆఖరికి-రెండవ రోజు శవయాత్ర మొదలైంది. వందమంది పోలీసులు రైఫిళ్లూ పిస్తోళ్లూ ధరించి రెండు వందలమంది ఉన్న ఊరేగింపుని సూపర్వైజ్ చేస్తుంటే ఊరంతా ఇంట్లెక్కి చూసింది. మిద్దెలెక్కి చూసింది. షేడలు, డాబాలు అన్నీ ఎక్కి ఊరు కళ్లు రిక్కించింది. జనం నినాదాల్ని దిగమింగి ద్వేషాన్ని కళ్ళ లోంచి కక్కారు.

మహాత్మాగాంధీ రోడ్డుమీద హింసకు బలైన డాక్టరుగారి శవం వెనక అహింసా పోలీసుల బూట్ల చప్పుడులో విప్లవ నినాదాలు అణిగిపోయాయి. కోపంతో గొంతులు పెగలకపోతే అది భయంగా భ్రమించారు. భయం జనాన్ని రెచ్చగొట్టింది. కొత్తవాడ లోకి శవయాత్ర చేరేసరికి జనం రెండింతలయ్యారు. కొత్తవాడదాటి ఆటోనగర్ స్మశానం చేరేసరికి నాల్గింతలయారు. స్మశానం గేటు దగ్గర పోలీసుల కాపలా. మనుషుల మొహాల్ని చూడటం, వదలటం. ఏమాత్రం పనికి వచ్చే మనిషైనా లాగి వ్యాన్లో ఎక్కించటం, పోలీసులు స్మశానం చుట్టూ వలయంగా ఏర్పడ్డారు. ముఖ్యుల్ని తప్ప ఎవర్నీలోపలికి పోనీయలేదు. లోపల ముళ్ళ కంపలు, కాలినచితుల బూడిదలు, వర్షానికి చిత్తడిగా మారిననేల. స్మశానం బీభత్సంగా వుంది. ఎక్కడినుంచి పుట్టు కొచ్చారో తెలియదు. ముళ్ళపొదల చాటునించీ, సమాధుల వెనకనించీ జనం వచ్చి చేరుతున్నారు. ఎవడు ఎక్కడ ఎవర్ని ఆపితేనేం ? ఎవరు ఎక్కడికి రావాలో వాళ్ళంతా అక్కడికి వచ్చి చేరుతూనే వున్నారు. అంతదాకా గంభీరంగా వున్నవాళ్లు కూడా అక్కడికి వచ్చాక ఏడవకుండా ఉండలేక పోయారు.

కృష్ణ ఒక సమాధినానుకుని నిలబడ్డాడు. ఎదురుగా చితిమీద డాక్టరుగారు. ఎక్కడెక్కడి జనమో, ఏనాటి జ్ఞాపకాలో, ఏతీరు కృతజ్ఞతో వచ్చి చితికి నమస్క రిస్తున్నారు. ఆయన పాదాలకి దండంపెడుతున్నారు. శత్రువు చక్రవ్యూహం జనం ప్రేమని ఆపలేకపోయింది. మఫ్టీలో ఉన్న స్పెషల్ బ్రాంచి ఏజెంట్లు బిత్తరపోయి చూస్తున్నారు. ఎంత రహస్యంగా కనీసం పరిమితంగానైనా దహనకార్యక్రమం జరిపిద్దామనుకుంటే చివరికి ఇంత పెద్దగా తయారైంది. ప్రహరీ గోడచుట్టూ పోలీసులు. దూరంగా ఇళ్లు ఎక్కిచూస్తూజనం.

ఎదురుగా ప్రాణదాత ప్రజ్వలిస్తున్నాడు. ప్రాణదాత నుంచి చెలరేగుతున్న మంటల కొసలమీద విషాద వర్తమానమూ, ఆశావహ భవిష్యత్తూ సంఘర్షిస్తున్నాయి.

మానవతా విలువలు

# ఊళ్ళోకొచ్చిన 'ఎన్‌కౌంటర్'లు

కె. బాలగోపాల్

కళ్లముందు కనబడ్డ దృశ్యాన్ని కాగితం మీదికి ఎక్కించే వాళ్లం. ఇప్పుడు పత్రికలలో చదివిన వార్తను కళ్లతో ఊహించుకుంటున్నాం. నర్సంపేట మెయిన్ రోడ్డులో షేనెల మండుటెండలో కుర్రవాళ్లను చొక్కాలు విప్పి కరుగుతున్న తారుమీద పొర్లించారని చదివాం. నిస్సహాయంగా ఆ దృశ్యాన్ని ఊహించుకున్నాం. మెయిన్ రోడ్డంటే బస్టాండు నుండి తాసీల్దారు ఆఫీసు మీదుగా గూడురుకో మహబూబాబాద్‌కో పోయే రోడ్డే కాబోలు. మామిడాల హరిభూషణ్ 'ఎన్‌కౌంటర్' హత్యమీద వరంగల్ అర్బన్ తాసీల్దారు - నల్లటి చింత మొద్దులాంటి మనిషి - నర్సంపేట తాసీల్దార్ ఆఫీసులో 1983 ఆగస్టునెల చివరిరోజున కాబోలు మెజిస్టీరియల్ విచారణ జరిపాడు. చంపింది వర్ధన్నపేట తాలూకాలో నయితే విచారణ వరంగల్ అర్బన్ తాసీల్దారు నర్సంపేటలో జరపాల్సిన అగత్యం ఏ నిగూఢమయిన కారణాల వల్ల వచ్చిందో ఇప్పుడు జ్ఞాపకంలేదు. బహుశా ఇతరత్రా విచారణ జరపడానికి 'శాంతి భద్రతల' సమస్య ఏదో అడ్డు వచ్చే వుంటుంది. నర్సంపేటలో రాలేదని కాదు ఎంతగా వచ్చిందంటే తాసీల్దారు ఆఫీసు మీదుగా గూడూరుకో మహబూబాబాదుకో పోయే ఈతారురోడ్డు నల్లరంగా ఖాకీరంగా అనేంతగా వచ్చింది. బస్టాండ్ ఆవరణచుట్టూ పొర్లుదండాలు పెడుతూ ఆరోజంతా జీపు తిరిగింది. బస్సులు దిగిన వాళ్లను నఖశిఖ పర్యంతం పరీక్షించింది. రక్తబంధువులనూ పౌరహక్కుల వాళ్లనూ మాత్రమే తారురోడ్డు ఎక్కనిచ్చింది. ఇదంతా ఎందుకని విచారణ జరుపుతున్న తాసీల్దారుగారిని అడిగితే తనకుగూడ అదేసందేహంవచ్చి డి. ఎస్. పి. దొరను అడగ్గా తమరి ప్రాణరక్షణ కొరకేనని చివాట్లు పెట్టారని కించిత్ సిగ్గు చెందుతూ అంటాడు. ఎవరినుండి రక్షణ అంటే స్థానిక జూనియర్ కళాశాల విద్యార్థుల నుండి అని తల ఇంకొంచెం దించుకొని అంటాడు. నువ్వు విచారణ జరుపుతున్న గది కిటికీలలో నుండి పోలీసులు తొంగి చూస్తున్నారు అదేమిటంటే ఏదీ నాకు కనబడలేదే అంటాడు.

ఆ తారురోడ్డేనా ? అదే అయివుండాలి. ఆ వూళ్లోవేరే తారురోడ్డు ఒకటి ఉన్నట్టు జ్ఞాపకం. అది బస్‌స్టాండు నుండి ఉత్తరానికి పోతుంది. పోగా పోగా జూనియర్ కళాశాల వస్తుంది. కమ్యూనిస్టు మార్క్సిస్టు (అటు పిమ్మట మార్క్సిస్టు కమ్యూనిస్టు) నాయకుడు, అటుపిమ్మటా ఇటుపిమ్మటా గూడ రాష్ట్ర శాసన సభను అలంకరించిన (లేక రాష్ట్ర శాసనసభచేత అలంకరించబడిన) ప్రజా ప్రతినిధి అయిన శ్రీ (లేక కామ్రేడ్) ఓంకార్‌గారు ఆకాలేజీ ఆవరణలో ఒక సంవత్సరం (బహుశా అనేక సంవత్సరాలు) విద్యార్థి సంఘ అవతరణోత్సవం (లేక అవతారం చాలించిన ఉత్సవమేమో) సందర్భంలో ఒక ఎర్రటి సాయంసంధ్యవేళ ప్రభుత్వాన్ని కాదు, నర్సంపేటలో అమలులో వున్న కల్లోలిత ప్రాంతాల చట్టాన్ని కాదు, నక్సలైట్ పార్టీలనూ వారి రాజకీయాలనూ భీకరంగా తిట్టాడు. వాళ్లను తరిమికొట్టడానికి లేవండి లేవండని ప్రజలకు పిలుపిచ్చాడు. ప్రజలు కూర్చునే కరతాళ ధ్వనులు చేసారు (చేయ లేదంటే అబద్ధమవుతుంది.) ఇది ఆ తారురోడ్డు కావడానికి వీలులేదు. తాసీల్దారు ఆఫీసు మీదుగా గూడూరుకో మహబూబాబాదుకో పోయేదే అయివుండాలి.

ఆ తారురోడ్డు మీద కుర్రవాళ్లను చొక్కాలు విప్పి మేనెల మండుటెండలో పొర్లించారని వార్త. ఎందుకోసం పొర్లించారు? ఆరోజో ఆతరువాతి రోజో ఆ వూళ్లో బంద్ పాటించమని రాడికల్స్ పిలుపు ఇచ్చారని. తమ కార్యకర్త గంగన్న అనబడే ఇమాంను పోలీసులు అరెస్టుచేసి చిత్రహింసలు పెట్టి చంపేసి, ఉరిపెట్టుకున్నాడనో గుండెపగిలి చచ్చాడనో,సొరంగం తవ్వుకొని పారిపోయాడనో, అకస్మాత్తుగా అదృశ్యం అయిపోయాడనో అనక, ఏకంగా సికిందరాబాద్- నర్సాపూర్ ఎక్స్‌ప్రెస్ కింద పడేసి ఆక్సిడెంటయిపోయింది అయ్యో పాపం అన్నారంట. అందుకు నిరసనగా రాడికల్స్ బంద్ పిలుపు ఇచ్చారు. అందుకు నిరసనగా పోలీసులు వాళ్లను చొక్కాలు విప్పి ఎండలో తారురోడ్డు మీద పొర్లించారు. నిరసన తెలిపే హక్కు ఒకరికి మాత్రమే ఎందుకుండాలి ? అందరికీ ఉండాలి. అంతవరకూ వరంగల్ నయమే. నిజామాబాద్ జిల్లాలో బంద్ పిలుపిస్తే పోలీసుల నిరసన 'ఎన్‌కౌంటర్ల' రూపం తీసుకుంటోంది. ఆ జిల్లా పోలీసు సూపరింటెండెంట్‌గారి వాచాలత్వం ఎంతటిదో వారి సిబ్బంది హస్తలాఘవం అంతటిది. చేదోడు వాదోడు అంటారు, దీనినే కాబోలు.

గంగన్న అనబడే ఇమాం మీద పోలీసుల కసి ఇవాల్టిది కాదు. రెండేళ్ల క్రితం అతనికోసం వెతుకుతూ మహబూబాబాద్‌లోని సోషల్ వెల్ఫేర్ హాస్టళ్లమీద

పడి నానా భీభత్సం చేసారు. హరిజన గిరిజన తదితర అలగా జనాన్ని పైకి తీసుకు రావడానికి సోషల్ వెల్ఫేర్ హాస్టళ్లు పెట్టామన్నారు. వాళ్లకు ఉండడానికీ చదువు కోడానికీ ఇంత తినడానికీ వసతి కల్పించడం మన సోషలిస్టు తరహా సమాజం కర్తవ్యం అన్నారు. ఈ తరహా ఔదార్యంతో వచ్చిన చిక్కేమిటంటే ఆశించేది ఒకటయితే జరిగేది ఇంకొకటి. అలగా జనానికి చెందిన యువకులంతా హాస్టళ్లలో చేరతారు. విడివిడిగా వుంటే రాని ఆలోచనలు కలిసి వుంటే వస్తాయి. అక్షరాస్యత అబ్బిన తరువాత చదువుకోమన్న పుస్తకాలు మాత్రమే చదువుకోరు - ఏవేవో చదువుతారు. బూతుసినిమా పాటలు పాడుకోండని సినిమా పాటల పుస్తకాలు పేవ్‌మెంట్ల మీద పావలాకూ అర్థకూ బహిరంగంగా అమ్ముతుంటే అవి కొనుక్కోక ఎక్కడినుండో రహస్యంగా వేరే పాటల పుస్తకాలు కొనుక్కొచ్చి అవి పాడు కుంటారు. సోషలిస్టు తరహా ఆదర్శాలకు పోతే చాప కిందికి నీరొచ్చేటట్టుందని ఈ సోషల్ వెల్ఫేర్ హాస్టళ్ల మీద ఒక కన్నువేసి ఉంచమని ప్రభుత్వం తన పోలీసు శాఖకు ఆదేశం యిచ్చింది. గత రెండు మూడేళ్లలో తెలంగాణ జిల్లాలలో లెక్కలేనన్ని సోషల్ వెల్ఫేర్ హాస్టళ్ల మీద దాడులు చేసి పెట్టెలూ బట్టలూ బయటకు లాగి కుర్రవాళ్లను కొట్టి అరెస్టు చేసారు. మాంత్రికుడి గుహలాగ రహస్య మందిరాలతో సొరంగాలతో బయటకు కనిపించే దానికన్న పదిరెట్లుండె పోలీసు శాఖలో ఎక్కడో ఒకమూల సోషల్ వెల్ఫేర్ హాస్టళ్లకోసం ఒక ఆఫీసర్ ఆన్ స్పెషల్ డ్యూటీ (ఎంత చక్కటి అనిశ్చితమయిన నామధేయం !) ఉన్నాడని గట్టి అనుమానం.

ఆనాడు గంగన్నకు అన్నం పెడుతున్నారని మహబూబాబాద్‌లోని సోషల్ వెల్ఫేర్ హాస్టళ్లమీద పోలీసులు దాడిచేసి కుర్రవాళ్ళనందరినీ కొట్టి తరిమేసారనీ వాళ్లంతా అక్కడా యిక్కడా తలదాచు కున్నారనీ తెలిసి, మహబూబాబాద్ పోయి తీరాలని డాక్టర్‌గారు పట్టు బట్టారు. అక్కడికి పోయి మాట్లాడిన తరువాత మహబూబాబాద్‌లోనే కాదు, బలపాల గ్రామంలో గూడ హాస్టల్ ఖాళీ చేయించారనీ కుర్రవాళ్లనేకాదు, వార్డెన్‌నూ వంట వాడినీ సహితం అరెస్టు చేసారనీ తెలిసింది. చీకటయినా సరే వూళ్లో పోలీసు క్యాంపు ఉన్నా సరే బలపాలకు పోయి తీరాలని డాక్టరుగారు ఆరాట పడ్డారు.

బలపాల అంటే మేళ్ల చెరువు నాగేశ్వరరావు ఊరు. మేళ్ళచెరువు నాగేశ్వరరావు ఇప్పుడులేడు. ఈ నవంబర్‌కు అతను చనిపోయి అయిదు సంవత్సరాలు అవుతుంది. అతను ఎవరో తెలుసుకోవాలంటే మీరు మహబూబాబాదులో బహిరంగంగా అడిగితే చెప్పరు. కోళ్ళా గొర్రెలా దొంగిలించి మానుకోట మున్సిఫ్ కోర్టు నుండి వరంగల్‌కు రిమాండుకు వచ్చిన లంబాడాలను జైలులో అడిగితే చెప్తారు. మనదేశంలో అన్ని విషయాలూ స్వేచ్ఛగా మాట్లాడుకోగలిగేది జైళ్ళలోనే- బయట కొన్ని విషయాలు మాత్రమే మాట్లాడుకోగలం. మేళ్ళచెరువు నాగేశ్వరరావు ఎవరంటే వాళ్ళు ఒక్కమాటే చెబుతారు. ఆప్రాంతాన్ని ఇప్పటికీ ఏకచ్ఛత్రంగా ఏలుతున్న దొర్నకల్ దేశముఖ్‌లకు ఇద్దరే ఇద్దరంటే గుండెబెదురు. వాళ్ళలో ఒకరు మేళ్ళచెరువు నాగేశ్వరరావు. (రెండవ వ్యక్తి ఇప్పటికింకా బతికే వున్నాడు కాబట్టి అతనిపేరు చెప్పడం - జైలు బయట - శ్రేయస్కరం కాదు). 1981 నవంబర్‌లో మహబూబాబాద్ సిఐ అతన్ని అరెస్టుచేసి పంచాయితి సమితి వైస్ - ప్రెసిడెంట్ అమృత రెడ్డికి అప్పగించి చంపించాడు. అమృతరెడ్డి ఈహత్య 'ఆత్మరక్షణార్థం' చేసాడని వరంగల్ ఎస్. పి. తానే కోర్టయి తీర్పు ప్రకటించాడు. ఆమహానుభావుడు తదుపరి తిరుపతికి పోయి వెంకన్నకు తలవెంద్రుకలు మొత్తం, నగదుకొంచెం అర్పించుకున్నాడు. సిఐకిగూడ 30 వేలునగదు ముట్టిందని అంటారు. ఇంటిలిజెన్స్‌లో వున్న కారణంగా ఇటువంటి ఆదాయానికి నోచుకోని ఒక ఎస్ఐ మాత్రం అటూఇటూ చూసి 'ఇంకా చాలా ఎక్కువే ముట్టింది సార్' అని కసిగా రహస్యం చెప్తాడు ఎంత కచ్చ అనుకొన్నా ఇంటిలిజెన్స్ వాడు కాబట్టి నిజమే అయివుండాలి.

ఈ పాత విషయాలు ఇప్పుడెందుకంటే అదే అమృతరెడ్డి గత సంవత్సరం ఇంకొకసారి పుణ్యం కట్టుకున్నాడని అంటారు. భూపతిరెడ్డి, సారయ్య అనే యిద్దరు యువకులను గత సంవత్సరం మేనెల 26 రాత్రి వరంగల్ పట్టణంలోని వాళ్ళ వకీలు యింట్లోనుండి తీసుకుపోయి 54 కిలోమీటర్ల దూరంలోవున్న నర్సాపూర్ గ్రామం శివార్లలోని బంజర్లలో ఒక వొర్రెకు అవతల నిలబెట్టి పోలీసులు ఇవతల నిలబడి కాల్చి పారేసారు. ఇదిగూడ అమృతరెడ్డి చలవేనని వినికిడి. నర్సాపూర్ దాకా ఎందుకు తీసుకు పోయారు, వాళ్ళ వకీలు యింటికి ఫర్లాంగు దూరంలోవున్న హంటర్ రోడ్డు

మీదకాల్చి పారేయలేక పోయారా అని ఆరోజు ఎవ్వరికీ తోచలేదు. ఇవ్వాళ ఆ సందే హం వస్తోంది. ఎలాగూ చంపేదానికి 54 కిలో మీటర్లు పెట్రోల్ దండగ ఎందుకు ? ఆనాటికింకా, 'ఎన్‌కౌంటర్లు' చేయడం తప్పుకాదుగాని అడవిలోనో అడవి అనిపించుకో గల చోటనో చేయాలని పోలీసులలో ఒక అపోహ ఉండేది. వరంగల్ పట్టణం వదిలి ఉత్తర దిక్కుగా గోదావరి వైపుపోతే ములుగు తాలూకా కేంద్రం చేరేసరికి గోదావరి లోయ అడవి కొద్దికొద్దిగా ప్రారంభం అవుతుంది. రహదారి వదిలి 8 కిలోమీటర్లు పడమటికి పోతే నర్సాపూర్ గ్రామం తగులుతుంది. ఆ గ్రామం బంజర్లను మసక చీకట్లో అడవి అనుకోవచ్చును. అందుకే కాబోలు కాల్చడానికి అక్కడిదాకా తీసుకు పోయారు. ఈ 'ఎన్‌కౌంటర్' విషయంలో ప్రభుత్వం వ్యవహరించినతీరు వరంగల్ పోలీసులకు కనువిప్పు కలిగించినట్టుంది. ఇది ఎన్‌కౌంటర్ కాదని, హత్యఅనీ, ఎన్నో సాక్ష్యాలున్నా అవన్నీ మెజిస్ట్రీరియల్ విచారణలో రికార్డయినా, కలెక్టర్ తన నివేదికలో ఆవిషయమే చెప్పినా, కలెక్టరు ఇంట్లో ప్రతిరోజూ ఎ. పి. సి. యల్. సి బాధ్యులు భోజనం చేస్తారని ఆరోపించి ఆయనను హైదరాబాదుకు, విచారణ జరిపిన వర్మాల సబ్ కలెక్టర్ 'తీవ్రవాదుల' సానుభూతిపరుడని ఆరోపించి ఆయనను గుంటూరుకు, బదిలీచేసి విచారణ అక్రమంగా జరిగిందని సుప్రీం కోర్టుకు తెలిపి నివేదికను ఉపసంహ రించుకొని కొత్త విచారణ జరిపించింది ప్రభుత్వం.

పైనుండి ఇంతటిచేయూత వచ్చేసరికి వరంగల్ పోలీసుల అపోహలు పటా పంచలయినట్టున్నాయి. తమకు ప్రభువులు ఇచ్చిన లైసెన్సుకు స్థల వివక్ష లేదని వాళ్ళకు అర్థమయింది. బహుశా, పట్టణం నడిబొడ్డున కాల్చేస్తే హోం మంత్రిగారు పరాక్రమ ప్రదర్శనకు యిచ్చే నగదు బహుమతి ఇంకింత ఎక్కువ ఇస్తూ న్నారేమో — ఎవరికి తెలుసు. అందుకే ఈ సంవత్సరం వరంగల్ పోలీసులు తాము చంపదల్చుకున్న వాళ్ళను పట్టణంలోని హంటర్ రోడ్డు మీదనే కాల్చేస్తున్నారు. రేపు చౌరస్తాలోనే కాల్చేస్తారేమో — అదిమాత్రం ఎవరికితెలుసు.

హంటర్ రోడ్డు మీద మే 20 రాత్రి ఇద్దరినీ సెప్టెంబర్ 6 రాత్రి ఇద్దరినీ మొత్తం నలుగురిని కాల్చిపారేసారు — హంటర్ రోడ్డు మీద కాల్చేసారు అనేకంటే హంటర్ రోడ్డు మీద కాల్చామన్నారు అనాలేమో బహుశా. వాళ్ళను నిజంగా ఎక్కడ కాల్చిందీ తెలీదు. మొదటి ఇద్దరినీ రీజనల్ ఇంజనీరింగ్ కాలేజీ ఆవరణలో కాల్చేసారని ఊళ్ళో పుకారు. బయటి వాళ్ళకు ఇది వింతగా అనిపిస్తుందేమో — మద్రాసు ఐఐటి

ఆవరణలో 'ఎన్‌కౌంటర్' ఊహించుకోగలమా ? - కాని వరంగల్‌తో పరిచయం ఉన్న వాళ్ళకు అర్థవంతంగా వుంటుంది. ఆర్ఇసి మీద పోలీసులకోపం ఇవాళ్టిదికాదు. ఎమర్జెన్సీకి పూర్వంనుండి కూడ 'తీవ్రవాదులస్థావరం' అనిపించుకున్న ఆర్ఇసి అంటే వాళ్ళకు కన్నెర్ర. అప్పటికాజీపేట ఎస్ఐ రాక్షస విగ్రహం ఆర్ఇసి విద్యార్థులందరికీ చిరపరిచితం. ఎమర్జెన్సీ ప్రకటన అర్థం ఏమిటో ప్రకటించిన వారం రోజులకే ప్రపంచానికి తెలియచేసిన గిరాయిపల్లి 'ఎన్‌కౌంటర్' మృతులలో ముఖ్యుడు సూరపనేని జనార్దన్ ఆర్ఇసి విద్యార్థి. కాలేజీ జరుగుతున్నంతసేపూ హాస్టల్ ఆవరణలో తాటి చెట్లకింద కూర్చుని వచ్చేపోయే మెస్ వర్కర్లతో పిచ్చాపాటితో మొదలు పెట్టి రాజకీయాలదాకా మాట్లాడే జనార్దన్ విగ్రహం అక్కడ చదువుకున్న వాళ్ళందరికీ పరిచయమే. ఆ వారసత్వమేమో, పోను పోను పోలీసులకు ఆర్ఇసి విద్యార్థులతో సమంగా మెస్ కార్మికులమీద దృష్టిపడింది. వాళ్ళు విప్లవపార్టీల పక్షపత్రికలూ పాటల పుస్తకాలూ కూడబలుక్కొని చదువుతూ ఓనమాలు దిద్దుకున్నారు. వాళ్ళకు అక్షరజ్ఞానం రాజకీయాలతో వచ్చింది. ఎన్నడూ అఆలు నేర్చుకోవాలని తపన చెందని వాళ్ళు అవి రాకపోతే పాటల పుస్తకాలు చదవలేం అన్న ఆరాటంతో అక్షరాస్యులయ్యారు.

మొదటినుంచీ ఈ కారణాల వల్ల పోలీసులకు ఆర్ఇసి అంటే పీకలదాకా కోపం. తమకు విచ్చలవిడిగా ప్రవేశించడానికి అనుమతి ఇవ్వలేదని ఆర్ఇసి ప్రిన్సిపాల్ మీద గూడ కోపం. ఆయనను లొంగదీసుకోవడం కోసం పోలీసులు ఆయనకు 'నక్సలైట్' అని పేరుపెట్టగా రాష్ట్రీయ స్వయంసేవక సంఘం వారు దాన్ని దేశమంతటా దండోరావేసి తమవంతు కర్తవ్యం నిర్వహించారు. ఇరువైపుల నుంచీ జరుగుతున్న ఈ దాడికి తట్టుకోవడం ఆయనకు వశంకాక, గతసంవత్సరం నుండి ఆర్ఇసి ఆవరణలోకి పోలీసులు యథేచ్ఛగా ప్రవేశించడం మొదలయింది. కొంత కాలం పోలీసులు క్యాంపు పెట్టారు, సమ్మెచేస్తున్న విద్యార్థులను తరిమి కొట్టారు. సెప్టెంబర్ తరువాత ఈ భీభత్సం తీవ్రస్థాయిని అందుకుంది. క్లాసురూములలోని అత్యాధునిక సాంకేతిక విద్యాబోధనకు బయట వరండాలో పహార్లు చేస్తున్న తుపాకుల పదఘట్టన బ్యాక్‌గ్రౌండ్ మ్యూజిక్ అయింది. అటువంటి కళాశాల ఆవరణలో 'ఎన్‌కౌంటర్' ఒకవేళ నిజంగానే జరిగినా ఆశ్చర్యం ఏముంది ?

చనిపోయిన యువకుల పేర్లు నాగేశ్వరరావు, రామకృష్ణ. నాగేశ్వరరావును కాజీపేటలో మే 20 సాయంత్రం 7 గంటలకు, రామకృష్ణను వరంగల్‌లో అదేరాత్రి

11 గంటలకు అరెస్టుచేసి అర్ధరాత్రి కాల్చేసారు. నిలబెట్టి గురిచూసి కాల్చేసారనడానికి చిహ్నంగా, వాళ్ళశరీరంలో ఒకదాని పక్కన ఒకటి ఎనిమిది బుల్లెట్లు తుంటి భాగం నుండిఎదదాకా వున్నాయని శవపరీక్ష అనంతరం మృతదేహాలను దహనం కోసం తీసుకు పోయిన బంధువులు అంటున్నారు.

ఇద్దరివయస్సూ 25లోపే. ఇద్దరూ చదువులలో తెలివయిన వాళ్ళే, చురుకయినవాళ్ళే. జీవితంలో పైకిపోవడమేధ్యేయం అయివుంటే సునాయాసంగా సాధించగలిగే వాళ్ళే. కళ్ళముందు లేనిమనిషిని గుర్తుచేసుకుంటే ముఖం ఫోటోలాగ గుర్తుకురాదు. ఏదో ఒక ప్రముఖ లక్షణం మాత్రం జ్ఞాపకం వస్తుంది. నాగేశ్వరరావును తలచుకుంటే కళ్ళలోని చురుకుదనమే గుర్తుకొస్తుంది. కళ్ళలోనూ మాటలలోనూ చాలా పదును ఉండేది. తమను తాము పెద్దలుగా భావించే వాళ్ళకు అది తిరస్కారంగా కూడ అనిపించేది. రామకృష్ణ పూర్తిగా సౌమ్యుడు. 'ఇతను రాడికల్ ఎట్లాగయ్యాడు' అనిపించేవ్యక్తి. ఇతనే రాడికల్ అయితే రాడికల్స్ 'మంచివాళ్ళే' అయివుండాలి అని అతనికి వరంగల్ ప్రభుత్వ పాలిటెక్నిక్‌లో పాఠాలు చెప్పిన ఒక అమాయకపు పంతులు ఒకసారి అన్నాడు. పోలీసుల కళ్ళకు ఆ మంచితనం కనిపించినట్టులేదు.

వీళ్లను చంపిన మూడున్నర నెలలకు, సెప్టెంబరు 6 నాడు, అదే హంటర్ రోడ్డు మీద ఇంకొక యిద్దరిని చంపినట్టు పోలీసులు గర్వంగా ప్రకటించుకున్నారు. శ్యాంప్రసాద్ ఆర్ ఇ సి విద్యార్థి. ఒకసారి చూస్తే మళ్లీచూడాలనిపించేస్ఫురద్రూపం. తెలివయినవాడు, నెమ్మదస్తుడు. శ్రీనివాస్ చదువు ముగించుకొని స్వగ్రామంలో ఉంటున్న యువకుడు. శ్యాంప్రసాద్‌తో బాటు దొరికాడని శ్రీనివాస్‌ను చంపారేగాని లేకుంటే అతన్ని చంపాల్సిన 'అవసరం' పోలీసులకు ఎంత మాత్రం లేదు. వీళ్లను చంపింది పద్మాక్షమ్మ గుట్ట కింద కాయంపేట చౌరస్తా దగ్గరున్న పాడుబడ్డ శివాలయం వద్దనంట. ఈ గుట్టకు చాలా చరిత్ర వుంది. పద్మాక్షమ్మ పేరిటే ఆవూరికి 'అమ్మకొండ' అనిపేరు వచ్చింది. అది తురకల నోట్లో హన్మకొండ అయి తిరిగి హైందవీకరణ చెందినప్పుడు హనుమ కొండ అయింది. ఇది పాత చరిత్ర కాగా, 1983 లో వరంగల్ పోలీసులు ఆఅమ్మ మీద పేలుడు పదార్థాల చట్టం కింద కేసు పెట్టినంత పనిచేసి చరిత్రను తిరగ రాసారు. ఆర్ట్స్ అండ్ సైన్స్ కాలేజీ సాయంకళాశాలలో పరీక్షలు జరుగుతున్నప్పుడు దాడిచేసి ఆవరణలోనూ వరండాలోనూ ఉన్న విద్యార్థులను రూములలోనికి తరిమి

తరిమి కొట్టారు. అడిగేవాడెవడులే అనుకున్నారు. అయితే ఆకాలేజీ అధ్యాపకులు నిరసన తెలపడమేకాక యూనివర్సిటీ అధ్యాపకులు 107 మంది నిరసన పత్రం మీద సంతకం పెట్టే సరికి సర్దుకొని, ఆకాలేజీ విద్యార్థులు ఆరుగురు పద్మాక్షమ్మ గుట్ట దగ్గర బాంబులఫ్యాక్టరీ నడుపుతున్నారనీ, అంత ప్రమాదకరమయిన విద్యార్థులను వెనకేసుకు రావడం తమకు శ్రేయస్కరం కాదనీ కలెక్టరు మరియు జిల్లా మేజిస్ట్రేటయిన జవహరి స్వయంగా పంతుళ్లను బెదిరించాడు. పద్మాక్షమ్మకు ఈ సంగతి తెలిసి గూడ పోలీసులకు ఫిర్యాదు ఇవ్వనందుకు ఆమెనుగూడ అబెట్‌మెంట్ ఛార్జి కింద ఇరికిస్తారేమోనని ప్రజలు ఉత్సుకతతో ఎదురు చూసారు, కాని పేలుడు పదార్థాల చట్టం కింద కేసు పెట్ట డానికి అనుమతి ఇయ్యవలసిన కలెక్టరు తన సహజ ఛాందసత్వం వల్లి భయపడ్డట్టు న్నాడు. ఇప్పుడు ఆ అమ్మను తప్పుడు ఎన్‌కౌంటర్‌కు గుడ్డి సాక్షిని చేసారు. ఆ వూరికి గ్రామదేవత అయిన పాపానికి ఆ దౌర్భాగ్యురాలు ఇంకా ఏమేం చూడాల్సి వుందో !

తమ విద్యార్థులను కొట్టి నపుడు కాలేజీ లెక్చరర్లు నిరసన తెలుపడం పోలీసులకు నచ్చలేదు. అదే సంవత్సరం మరొకసారి - ఈసారి కాలేజీలో - అటువంటి లాఠీ ఛార్జియే జరిగినప్పుడు మళ్లీమొత్తం యూనివర్సిటీ సిబ్బంది అలజడి చేసారు. నాలుగు రోజులు సమ్మె చేసారు. కెమిస్ట్రీ ప్రయోగశాల 'అకస్మాత్తుగా' తగలబడిన తరువాత విరమించుకున్నారు. అప్పటి కోపం పోలీసులకు పోనేలేదు. ఒక కాకతీయ విశ్వవిద్యా లయం అధ్యాపకులే కాదు, అసలు బుద్ధి జీవులంటేనే వాళ్లకు కోపం. హక్కుల గురించీ పోరాటాల గురించీ సమస్యలగురించీ మాట్లాడతారని వ్యతిరేకత. వివేచన మొదలయిన ఉత్తరక్షణం తమ తుపాకులకు ఆదరణ పోతుందని వాళ్లకు తెలుసు. ప్రజలకు సమస్యలుంటాయనీ సమస్యల నుండి అలజడి పుడుతుందనీ ఎప్పుడయినా ఒక పోలీస్ అధికారితో మాట్లాడి చూడండి, అసహనంతో అతని కళ్ళు ఎంత వేగంగా తుపాకీ గుళ్లలాగ అసహ్యంగా తయారవుతాయో గమనిస్తే ఆశ్చర్యపోతారు.

డాక్టర్ గారిని చంపిన తరువాత ఈ కోపం పలురూపాలలో తీర్చుకున్నారు. ప్రజా ఉద్యమాలకు మద్దతు ఇచ్చిన వాళ్లనూ పౌరహక్కుల ఉద్యమంలో పనిచేసిన వాళ్లనూ ఒక్కరిని గూడ మినహాయించకుండ దాడికి గురిచేసారు. కొందరిని పోలీస్ స్టేషన్‌కు పిలిచి బెదిరించి వదిలి పెట్టారు. కొందరిని కొట్టిపంపిచారు. కొందరికి

బంధువులద్వారా బెదిరింపు సందేశాలు పంపించారు. కొందరిని అరెస్టుచేసి జైలుకు పంపారు. సీతారామరావునయితే ఇంటిమీద దాడిచేసి కాళ్లుచేతులూ విరగ్గొట్టారు.

గతంలో నోరు మెదిపినందుకు కక్ష మాత్రమే కాదు, ఇక ఎవ్వరూ నోరు మెదపకూడదని గూడ వాళ్ళ ఉద్దేశ్యం. ప్రజాస్వామిక హక్కుల పట్ల పోలీసుల అసహనం ఎక్కడి దాకా వచ్చిందంటే ఉద్యమాలూ ఊరేగింపులూ అటుంచి, జనం తమ దైనందిన జీవితాన్ని కూడ ఎంత మాత్రం సద్దు వినబడకుండ గడుపుకోవాలి. ఎక్కడా కొంచెంగూడ 'అశాంతి' కనబడకూడదు. పేవ్ మెంట్ దిగినడవకూడదు, రాత్రిపూట జనసంచారం కనబడకూడదు, ముక్కుకు సూటిగా తప్ప పక్కకు చూద్దామన్న కుతూహలం కలగకూడదు, ఏంజరిగినా 'ఎందుకు' అని అడగకూడదు, తమకు దొరికిన దాని కంటే వీసమెత్తుకూడ ఎక్కువ కావాలని కోరుకోకూడదు. ఎమర్జెన్సీ మార్షల్‌లా ప్రకటనలు లేకుండ పోలీసు ఠాణాల నుండి ఫాసిజం నీళ్లూరినట్టు ఊరుతోంది. ఎక్కడి నుండో వరద వచ్చి ముంచేస్తుందని ఎన్నికల రాజకీయ పరిశీలకులు మీనమేషాలు లెక్కగడుతున్నారుగాని ఇప్పటికే ఈ ఊటతో నేలంతాతడిసి బురదయి ప్రజాస్వామ్యానికి కాళ్ళు దిగబడ్డాయి. ఊట మోకాలిలోతయ్యే దాకా మన ప్రజాస్వామ్యానికి సంరక్షకులకు తడి తెలియదు కాబోలు — అప్పుడు తెలిసి మాత్రం ఏంప్రయోజనం గనక.

మార్చినెల 21 తేదీన పసర గ్రామంలో ఒక అమానుషమయిన ఉదంతం జరిగింది. గోదావరిలోయ అడవిని అనుకొని ఉండే పసర మీద పోలీసుపహరా భూతపు భయం ఒక దశాబ్ది కాలంగా ఉంటూ వస్తోంది. ఆ వూరికి చెందిన రాజు అనే యువకుడు కుర్రచేష్టగా తన క్లాస్‌మేట్‌కు 'ప్రేమలేఖ' రాసాడట. ఆ అమ్మాయి తండ్రి ఆ విషయం ఎస్ఐ దృష్టికి తేగా ఈ మాత్రం చిలిపితనం గూడ ఆయనకు సహించరానిదనిపించి రాజును పట్టుకొని లాకప్పులో వేసి విపరీతంగా కొట్టాడు. తప్పుడు కేసులో ఇరికిస్తానని బెదిరించి వదిలి పెట్టాడు, రాజుఅవమానభారంతో అ సాయంకాలం ఊరిబయట చింత చెట్టుకు ఉరిపెట్టుకొని చచ్చిపోయాడు. ఊరి జనమంతా కోపంగా పోలీస్‌స్టేషన్‌దగ్గర గుమిగూడగా తమప్రాణానికి అపాయం అనిపించిపోలీసులు కాల్పులు జరిపి ఖ్వాజా అనే ప్రేక్షకుడిని చంపేసారు. ములుగులో ఉండే ఒక స్కూలు టీచరు ఈ వాస్తవాలను ఎ.పి.సి.ఎల్.సి దృష్టికి తీసుకొచ్చినందుకు ఆయనను పోలీసులు అరెస్టుచేసి 'వార్త ఎందుకు పంపావు' అని తిట్టి, కొట్టి, నాలుగుయిదురోజుల అక్రమ

నిర్బంధం తరువాత సెక్యూరిటీ ప్రొసీడింగ్స్ కింద జైలుకు పంపారు. అతన్ని ఉద్యోగం నుండి గూడ సస్పెండ్ చేయించారు.

ఎవ్వరూ ఎంత చిన్న 'అశాంతి'కి సహితం పాల్పడకూడదు. చిత్రహింసలు పెట్టి తప్పుడు కేసులలో ఇరికిస్తారు. దానిని ఎవ్వరూ ప్రశ్నించకూడదు. కాల్చిపారేస్తారు. దానిని ఎవ్వరూ పత్రికలకు చేరవేయకూడదు. స్కూలు టీచరయినా ప్రొఫెసర్లే అయినా అరెస్టు చేసి కొట్టి జైలుకు పంపుతారు.

అధ్యాపకులగతీ మేధావులగతీ ఇట్లాగుంటే ఇక జనం సంగతి చెప్పనక్కరలేదు. దేశమంతటా అంతేనంటారేమో కాని, ఒక తేడా ఏమిటంటే ఏ విజయవాడలోను విశాఖపట్నంలోనో జరిగితే అందరూ 'అత్యాచారం'గా గుర్తించేది జనగామలోను ఏటూరు నాగారంలోను జరిగితే 'తీవ్రవాదుల సమస్య' అవుతుంది. ఈ సంవత్సరం ఫిబ్రవరి 3 వ తేదీన విజయవాడలో నలుగురు అమ్మాయిలకు పోలీసులు శిరోముండనం చేసిన ఉదంతం రాష్ట్రవ్యాపితంగా అలజడికి దారితీస్తుంది. అయితే వరంగల్ జిల్లా గోదావరి అడవిలోని నాగారం గ్రామంలో 40 మందికి పోలీసులు గుండు చేయిస్తే అది వార్తసహితం కాలేదు - నిరసన సంగతీ అలజడి సంగతీ అడగకండి. లాకప్పు మరణాల గురించి - అవి విజయవాడలోనూ హైదరాబాద్‌లోనూ జరిగితే - భారతీయ జనతా పార్టీ సహితం ధర్నాలు నిరాహారదీక్షలు జరుపుతుందిగాని ఏటూర్‌నాగారం అడవిని ఆనుకుని కరీంనగర్ జిల్లాలోవున్న మహదేవ్‌పూర్ అడవిలో పోలీసుదాడులలో కొట్టిన దెబ్బలకు నిమ్మగూడెంకు చెందిన ఒకపురుషుడు, ఒక స్త్రీ, వేమన పల్లెకు చెందిన ఒక పురుషుడు చనిపోయారని వార్తవస్తే ధర్నాలు అటుంచి బహుశా 'అంతేనా?' అని అడుగుతారేమో! ఏటూర్ నాగారం అడవి నుండి దక్షిణాన మెట్టతాలూకాలదాకా అసంఖ్యాకంగా పోలీసు క్యాంపులు పెట్టి జనాన్ని మూకుమ్మడిగా తన్ని కొట్టి 'రోకలిబండలా' 'విమానాలా' ఎక్కించి రాక్షసంగా హింసిస్తూంటే అది గూడ వార్త కాలేదు. రాడికల్స్ బంద్ పిలుపు ఇచ్చినప్పుడల్లా వాళ్ళనూ వాళ్ళతో సంబంధాలున్నవాళ్ళనూ సంబంధాలు ఒకప్పుడుండి వదులుకున్నవాళ్ళనూ అందరినీ గుంపులుగా తోలుకొచ్చి చొక్కాలు విప్పి వీపుకు పోస్టర్లు అంటించి అసభ్యకరమయిన నినాదాలు ఇప్పిస్తూ పట్టణం నడిబజార్లో ఊరేగించినా, లేక బజార్లో పడుకోబెట్టి లాఠీలతోబాదుతూ పొర్లించినా, బజారులోని రంగు రంగుల దుకాణాలు

అద్దాలకళ్ళతో గుడ్లప్పగించి చూస్తాయేతప్ప వాటి వ్యాపారం వ్యవహారం ఒక కనురెప్పపాటు గూడ నిలపవు.

ఇంత మౌనంగా అన్యాయాన్ని సహించే ప్రపంచం అంటే పోలీసులకు ఏవగింపు కాకపోతే గౌరవం ఏర్పడుతుందా ? తమకు లొంగి పడివుండే వాళ్ళను అసహ్యించుకున్నంతగా పోలీసులు తమను ఎదిరించేవాళ్ళను అసహ్యించుకోరు. పిరికితనం పోలీసు యంత్రాంగం సహజ లక్షణం. పిరికివాడు తనకు అణిగి మణిగి పడివుండే వాడిని పురుగుతో సమంగా ఏవగించుకుంటాడు. బలహీనుడిని గౌరవించడానికి కొంత ఉదాత్తత కావాలి. ఈ విషయం పోలీసు ఇన్‌ఫార్మర్లనూ కిరాయిసాక్షులనూ వృత్తి పంచెలనూ అడిగితే చెబుతారు. వాళ్ళను పోలీసులు ఎంతగా వాడుకుంటారో అంతగా ఏహ్యభావంతో చూస్తారు. ఇప్పుడు - ముఖ్యంగా వరంగల్ కరీంనగర్ జిల్లాల్లో - నిరసన తెలుపవలసివుండి భయంతో అవకాశవాదంతో నోరుమూసుకున్న తెల్లబట్టల ప్రపంచం అంతా పోలీసులకు ఇన్‌ఫార్మర్లంత చులకనగా కనబడుతున్నారు. వకీళ్ళనూ మేజిస్ట్రేట్లనూ ప్రొఫెసర్లనూ వాళ్ళు డాఫర్లను చూసినట్టు చూస్తున్నారు. కాకతీయ విశ్వవిద్యాలయంలో సెమినార్ జరిగితే ఆహ్వానితుల ఫొటోలు తమకు ఇవ్వాలనీ, ఆర్ఇసిలో అధ్యాపకుల ఉద్యోగాలకు ఇంటర్వ్యూలు జరిగితే అభ్యర్థుల జాబితా తమకు చూపాలనీ, డిమాండు చేసి సాధించుకున్నారు. వకీళ్ల ఏ కేసులు చేయవచ్చునో ఏవి చేయకూడదో నిర్ణయిస్తున్నారు, చేయకూడని కేసులు చేసేవాళ్లను ఊరి నుంచి తరిమివేస్తున్నారు. కోర్టులు బెయిలు మీద ఎవరిని విడుదల చేయవచ్చునో ఎవరిని చేయకూడదో నిర్ణయిస్తున్నారు, విడుదల చేయకూడని వాళ్లను చేస్తే జైలు బయటే అరెస్టు చేసి మళ్ళీ లోపల పడేస్తున్నారు. విలేఖరులు ఏ వార్తలు పంపవచ్చునో, ఇళ్లగలవాళ్ళు ఎవరికి అద్దెకు ఈయవచ్చునో, ప్రెస్‌లు ఏ కరపత్రాలు వేయవచ్చునో ఏ పుస్తకాలు ప్రచురించవచ్చునో, ఇంకా అసంఖ్యాకమయిన విషయాలు పోలీసులు నిర్ణయిస్తున్నారు.

ఈ నూతన కర్తవ్యాన్ని నిర్వహించేపోలీసులు పాత పోలీసులు కారు. ఖాకీ బట్టలు, 303 రైఫిళ్ళు, బెల్టు ఆపలేని పొట్టలు, ఎన్నటికీ రాబోని ప్రమోషన్ గురించి ఆలోచనలు - ఇవన్నీ పోయాయి. ఈ సరంజామా జేబు దొంగలనూ వ్యభిచారులనూ పట్టుకోవడానికి సరిపోతుంది గాని రాజ్యం ఏలడానికి సరిపోదు. అందుకు వేరేరకం పోలీసులు కావాలి. వీళ్ళను చూడాలంటే ఏదయినా ఒక సాయంకాలం వేళ జిల్లా లేక

# గాంధీ వ్రతమహాత్యం

కె. రాంమోహన్‌రాజు

చక్కహా భోంచేసి పడక్కుర్చీలో ఒరిగి కళ్లు మూసుకుపోతుంటే మాయావిడ స్టీలు గిన్నెలో పాయసం తెచ్చింది. అరమూసుకు పోతున్న కళ్ళతో చూస్తే మాయావిడ మోహినిలాగాన్నూ ఆ పాత్ర అమృత పాత్రలాగాన్నూ కన్పించి ఒక్క ఉదుట్న అందుకుని గోరువెచ్చటి పాయసాన్ని జుర్రున జుర్రి ఉత్తరీయంతో మూతి తుడుచుకుని వెనక్కి ఒరిగాను.

---

తాలూకా కేంద్రం నుండి షికారుకు బయలుదేరుతూండగా చూడాలి. వీళ్లకు నేరపరిశోధనలో నైపుణ్యం కంటె కండబలం ముఖ్యం. తెల్ల బట్టలు, నంబర్ ప్లేటు లేని జీపులు, ఆటోమాటిక్ తుపాకులు, హత్యలు చేస్తే పారితోషికాలూ వీళ్ళకు ప్రభుత్వం కల్పించే ప్రత్యేక సదుపాయాలు. ఏ ప్రత్యేక సదుపాయాలూ లేకుండానే విరివిగా హత్యలు చేసే మన పోలీసు యంత్రాంగానికి ఇన్ని సదుపాయాలు కల్పిస్తే ఆగుతారా? కేవలం 'నక్సలైట్ల'నే కాదు, ఎవరి మీద ఏ కొంచెం అనుమానం వచ్చినా చంపుతారు. జనవరి 3వ తేదీన కాటోలు గూడూరు అడవిలోని ఊట్ల మట్వాడ అవుట్ పోస్టు పక్క నుండి పోతున్న ఇద్దరు యువకులను చూసి ఆగమని పోలీసులు హెచ్చరిస్తే వాళ్ళు ఆగకుండ ఇంకింత వేగంగా నడిచారట. ఇకనేం నక్సలైట్లే అయివుండాలని వెనక నుండి తరిమి కాల్పులు జరిపి ఆయిద్దరిలో నర్సయ్య అనే ఒక వ్యక్తిని చంపేసారు. అతన్ని 'గుర్తు తెలియని నక్సలైట్'గా చలామణి చేయడం సాధ్యంకాక, 'తప్పయిపోయింద'ని జిల్లా ఎస్. పి. ఒప్పుకున్నాడు. చంపడం కాదుతప్పు, నక్సలైట్ కాని వాణ్ణిచంపడం తప్పు. అయివుంటే చంపిన జవానుకు బహుమానం పదివేలో ఇరవయివేలో వసంతనాగేశ్వరరావు స్వయంగా ఇచ్చివుండేవాడు, కాకపోవడం వల్ల అతను సస్పెండ్ అయి నర్సయ్య కుటుంబానికి రెండువేలు నష్టపరిహారం ఇచ్చారు.

ఇవ్వాళ వరంగల్‌ను చూస్తే దక్షిణ అమెరికాలో సైనిక పాలన కింద వున్న దేశాలు గుర్తుకొస్తాయి. ప్రపంచంలోకల్లా అతిపెద్ద ప్రజాస్వామ్యంలో ఇది ఒక చెప్పుకోదగ్గ పట్టణం అనీ వెయ్యి సంవత్సరాల నాగరికతను చూసిన వూరనీ అంటే ఎవ్వరూ నమ్మరు.

మరుక్షణం చెంబులో నీరూ, తాంబూలం పెట్టే పట్టుకుని వచ్చి మాయావిడ నా ప్రక్కన నేల మీద కూచుంది. నీళ్ల రెండుసార్లు పుక్కిలించి ఉమ్మి తర్వాత రెండు గుక్కలు తాగి ఆవిడ అందించే తమలపాకులు నములుతూ 'హా గాంధిదేవా ! నామీద ఎంత దయ స్వామీ నీకు ?' అనుకుంటూ కళ్లు మూసుకున్నాను.

తాంబూలంలోని కర్పూరం ఆగ్రాపేటాలాగా మధురంగానూ, మిద్దెకొంపల్లోని నడిమింట్లోవుండే విధంగా చల్లగానూ వుండి మనసుకి హాయిని కలిగిస్తోంటే కలుక్కు మనేట్టు ఒక్క ఆలోచన తోచింది.

గాంధీగారు గనక ఈ దేశంలో పుట్టివుండకపోతే నా గతి ఏమయివుండును ? ఈ ఆలోచన నన్ను కలవర పరచింది. ఆ దుష్టమైన ఆలోచననించి తప్పించు కోటానికి లేచి అటూ ఇటూ తిరిగాను. ఆయనగారు గనక ఈ దేశంలో పుట్టివుండక పోతే నామటుకినాకు సామాజిక బాధ్యత తెలిపేదేకాదు.

ఈ సామాజిక బాధ్యత అనేది ఉంది చూశారూ అది మహాచెడ్డది సుమండీ ! అదిగనక బుర్రలో కెక్కిందా ఇక ప్రశ్నల పరంపర మొదలు. ఇదెందుకు చెయ్యాలి, అదెందుకు చెయ్యగూడదు, ఇలా కాకుంటా మరోలాగ చేసే వీల్లేదా అని ఈ విధంగా సామాజిక బాధ్యత అనేక ప్రశ్నల రంపాలు, గొడ్డళ్లుగా బాధిస్తుంది.

ఈ సామాజిక బాధ్యతా రంపబాధ నన్ను మొదటిసారి ఎలా బాధించిందీ మీకిప్పుడు చెబితేగానీ దాని విలువా, గొప్పదనమూ మీకర్థంకావు. అసలు నాగూర్చి నేను చెప్పుకోవడంకాదు నాకు ఇష్టంవుండదు. కానీ మెజారిటీ అభిప్రాయాన్ని గౌర వించాలని గాంధీగారు 1942 శ్రావణ ఏడో తారీఖున వార్ధాస్టేషను ప్లాట్‌ఫారంమీద నాతో చెప్పారు. అప్పుడు మీరక్కడలేరు గనక ఇప్పుడిది చెప్పాల్సివస్తోంది.

సరే, మొట్ట మొదటిసారి సామాజిక బాధ్యత నన్ను పట్టిపీకటంతో అసలు ఈ సమాజాన్ని మార్చడానికి ఏం అవసరమా అని తెగ ఆలోచించాను. ఆ రోజుల్లో ఎవడో నాదగ్గిర భావవిప్లవం వస్తే సమాజ విప్లవం వస్తుందని వాగేశాడు. అది గుర్తు పెట్టుకుని ఒక బ్రహ్మాండమైన ఖద ఒకటి రాసి ఓ పత్రిక్కి పంపేను. ఇక్కడ ఒక చిన్న టెక్నిక్ పాటించేను. వ్యావహారిక అనగా మీరూనేనూ మాట్లాడుకునే భాషలో సాహిత్యం ఉండాలన్జెప్పి గిడుగు రామ్మూర్తి అనే ఆయన అనటమూ, దాన్ని

చాలా మంది ఒప్పుకోవడముతో నేనున్నూ వ్యావహారిక భాషలో నేఖదని గిలికేను. నా వ్యావహారిక సొగసు మచ్చుకి ఒకటి చాలు. అన్నం అంతా పట్టిచూడాలా ఏమిటి ?

సాధారణంగా ఉంచుకున్న ముండనిగూడా సాహిత్యంలో 'ప్రియా' అని రాస్తారు. మనదగ్గిర ఇలాంటి పప్పులుడకవు. వ్యవహారికం అంటే వ్యవహారికమే.

ఇలాగ నేను మామూలు జనం భాషలోరాస్తే అది అవాస్తవికం అంటూ పెద్దన్నయ్యలాగా సలహాలిస్తూ సంపాదకప్పీనుగ నా కళాకండాన్ని తిప్పిపంపేడు. ఇక్కడ మీకో విషయం చెబితే విరుచుకుపడి చస్తారు. ఈ పత్రికలు నడిపేవాళ్ళకి తెలివి ఏడ్చి చావదు. వాళ్ళకి తెలీదు. చెబితేవినరు.

ఇంకో సంగతి నాకర్థమై పోయిందందోయ్. 'యంగ్ ఇండియా' చుట్టూ గాంధీ అనుయాయులు, 'నేషనల్ హెరాల్డ్'చుట్టూ నెహ్రూ అభిమానులు, 'ది హిందూ' చుట్టూ కస్తూరి ఫామిలీ, 'మరాఠా కేసరి' చుట్టూ తిలక్ మిత్రులు ఉన్నట్టు నేను ఖద పంపిన పత్రిక్కి గూడా ఓ సర్కిల్ ఉంది. పైగా ఆ పత్రిక్కి రచస్ల కరువొకటి వుంది. ఐనా నా ఖదని అచ్చు వెయ్యకుండా తిప్పిపంపేరు.

అసలు నాఖదని తిప్పిపంపడానికి వీళ్ళకెన్ని గుండెలుండాలండీ ? వెనకెప్పుడో గొప్పవని ఒప్పుకున్న వాల్మీకి ముక్కనీ, కాళిదాసు మాటనీ వాడెవడో గోర్కి అట గొప్పోడుగదా అన్జెప్పి వాడిదో పేరా, ఇంకెవడోలు-సున్ది మరో పేజీ, అంతేకాదు ఇరాను ఇరాకు నైజీరియా లైబీరియా ఘనాదేశాల కవుల రచయితల మాటలన్నీ జొప్పించి రాశానుగదా. వాళ్ళ మాటల్నే కాదన్నారంటే ఈ పత్రిక వెధవలకేం తెలుసో మీరు తెలుసుకోవాలి మరి. ఈ వెధవప్పీనుగులు నన్ను తొక్కిపెట్టకపోతే నేనీపాటికి ఆస్కారు అవార్డుకి అరగజంలో ఉండేవాణ్ని.

అసలు నాగురించి నేను ఆట్టే చెప్పుకోవటం మంచిది కాదనుకోండి. కానీ నాకో పబ్లిసిటీ ఏజెంటు అంటూ లేక పోవడాన్న, నాకురావలసిన కీర్తి రాకపోవడాన్న నా గూర్చి నేనే చెప్పుకోక తప్పటం లేదు. అంతేకాదు మనిషి తన్నుతాను తెలుసుకోవటం ఒక సామాజిక బాధ్యతండీ ! అది మనిషిని అసలు నిద్రపోనీదు. నాలాంటి వాడిని మరీనూ.

మా యావిడికి ఒంట్లో బాగాలేకపోడే నాదేం పోయింది చెప్పండి ? రాగ ద్వేషాలులేని నాలాంటివాడికి భార్యపిల్లలనే ఇహలోక బంధాలుండాలంటే వాటికెన్ని

గుండెలుండాలి ? కానీ ఒంట్లో బాగాలేదని వంట చెయ్యటంలో ఆలస్యం జరుగుతుందే. అప్పుడు నాకు ఒళ్లు కంపరమెత్తుతుంది.

ఒంట్లో కాస్త బాగాలేకపోతేనే నువ్వు వంటచెయ్యటం - ఏదీకాసిని పదార్థాలు ఉడకెయ్యటం - అంతేగా దాన్నే నిర్లక్ష్యం చేశావే మరి తన ప్రాణం ఎవడెప్పుడు ఎక్కడ తీస్తాడో తెలీక మన నాయకులు మనందర్నీ అహర్నిశమూ నడిపిస్తున్నారే, ప్రాణాలు పోతాయని తెల్సీ పోలీసులు తుపాకులుచ్చుకుని నించున్నారే ఎవడి పెళ్ళికని మీవుద్దేశం ? సామాజిక బాధ్యతంటీ సామాజిక బాధ్యత ! మీకింత చిన్న విషయం గూడా అర్థం కాకపోతే మరింక ఏదీ అర్థం కాదన్నమాటే. ఇక్కడొక ధర్మసూక్ష్మం మీకు తెలియజేసి ఆ తరువాత విషయం వదిలి పెట్టేస్తాను.

లోకంలో దుష్టులున్నారు, సజ్జనులున్నారు అని మనందరికీ తెల్సు. కానీ దుష్టులకీ సజ్జనులకీ గూడా పూజనీయుడైన వ్యక్తి ఒకడున్నాడని మీకింకా తోచి చావలేదు.

షాహుకారుగారు రాత్రి పడుకోబోయేముందు ఇనప్పెట్టికున్న ఏడురకాల తాళాలు బందో బస్తుగా వేసి ఆ తాళం చెవులు నోటితో చెప్పరాని చోట వేలాడదీసుకుని 'దేవా ! నాధనాన్ని రక్షించావంటే నీకో కొబ్బరికాయ కొడతాను' అన్జెప్పి నిద్ర పోయాడనుకోండి. అదేరాత్రి ఓ దొంగాడు ఆ ఇంట్లో చొరబడి తన దగ్గిర వున్న ఏడేడు పధ్నాలుగు రకాల తాళం చేతుల్నీ ఆ ఇనప్పెట్టెమీదికి ప్రయోగించ బోయే ముందు 'దేవా నా ప్రయత్నం ఫలించేట్టుచెయ్యి. నీ కొక్కొబ్బరికాయ కొడతాను' అని ప్రార్థించి తాళాలు తీయడానికి పూనుకుంటాడు.

అప్పుడేమవుతుంది ఏదీ చెప్పండి ? మీకు తెలీదు. చెప్పలేరు. అప్పుడేమవుతుందంటే తాళమూ వూడి వస్తుంది, షావుకారికి తెలివీ వస్తుంది. ఫలితం మాత్రం ఇద్దరి బలాబలాలమీద ఆధారపడి వుంటుంది. సరిగ్గా ఈ సూత్రం మీద గాంధీగారు తన అహింసా సూత్రం నిర్మించారు. అటు కసాయికీ కోపం రాదు, మేకకీ కోపంరాదు. ప్రశంసలు మాత్రం రెండు వైపుల్నించీ వస్తాయి.

ఇదంతా ఎందుకు చెప్పానంటే ఈ సూత్రం మీదే నేనూ నడుస్తున్నాను.

ఎలాగంటారా ? పత్రికవాడు నా రచన వేశాడా సరి. లేదూ విమర్శ అందు కుంటాను. ప్రతీ నెలా నాకథో, విమర్శో వెలుగు చూడాల్సిన పరిస్థితి ఈనాడు ఆంధ్ర

# తెలుగు వచనకవితా ప్రవాహంలో సృజన తరంగం

పృథ్వి

సామాజిక పరిణామం ఒక నిరంతర ప్రవాహం. సామాజిక చైతన్యమూ, కళా సాహిత్యాల వంటిసామాజిక చైతన్య రూపాలూ కూడ అలాధారావాహికంగా సాగేవే. ఆ నిరంతర ధార నుంచి ఏదో ఒక బిందువునో. ఒక భాగాన్నో దానికదిగా విడదీసి విశ్లేషించబూనడం దాని సారాన్ని పోగొట్టడమే అవుతుంది. అందువల్లనే కళా సాహిత్యాల చరిత్రను విడిగానో, కాలక్రమ పట్టికలో ఒక స్థానం నుంచి మరో స్థానం వరకో పరిశీలించడం వాటి సాధారణత్వాన్ని అర్థం చేసుకోక పోవడమే అవుతుంది. ఆమేరకు వాటి ప్రత్యేకతను అర్థం చేసుకోవడం కూడ అసాధ్యమవుతుంది. కనుక కళాసాహిత్యాల చరిత్రను చలనంలోనూ, ఇతర సామాజిక పరిణామాలతో, సామాజిక చైతన్య రూపాలతో అంతస్సంబంధంలోనూ అర్థం చేసుకోవాలి. ఈ చలనానికీ అంత స్సంబంధానికీ గల ప్రత్యేకతనూ, సాధారణత్వాన్నీ, నిర్దిష్టతనూ అమూర్తతనూ వెతికి పట్టుకుని అవగాహన చేసుకోవాలి.

ఈ అవగాహనతో ఈ రెండు దశాబ్దాల తెలుగు వచన కవిత, సృజన వేసు కున్న పరస్పర ప్రభావాల గురించి, పొందిన మార్పుల గురించి చేసే విశ్లేషణ వచన కవితకూ సృజనకూ మాత్రమే పరిమితం కాజాలదు. ఈ విశ్లేషణ తెలుగు సమాజం తోనూ, సామాజిక పరిణామంతోనూ అనుసంధానం పొందక తప్పదు. సమకాలీన సమాజాన్నీ, వచన కవితనూ, సృజననూ వాటి ఘర్షణలో, చలనంలో, అభివృద్ధిలో అర్థం చేసుకున్నప్పుడు మాత్రమే ఈ పరిశీలన సార్థకమవుతుంది.

---

దేశమంతా ఏర్పడి పోయిందంటే నమ్మండి. కానీ ఆంధ్ర ప్రజానీకానికి నా సాహిత్య సృజన ఆస్వాదించే అస్కారం లేకపోయింది.

ఎంచేతంటారా ? నేను ఏరచనా చెయ్యకుండా ఉండగలందుకుగాను తెలుగు పత్రికలన్నీ నాకు ప్రతీనెలా పాతిక చొప్పున పంపుతున్నాయి.

మెజారిటీ అభిప్రాయాన్ని గౌరవించాలని గాంధీగారు నాతో 1942 ఫిబ్రవరి ........ ఆఁ ఎందుకులెండి !

సామాజిక పరిణామం గానీ, సామాజిక చైతన్య రూపాల పరిణామం గానీ తేదీల అడ్డు కట్టలలోకి ఖచ్చితంగా ఇమిడేవి కావు. భవిష్యత్ పరిణామాల ప్రతిఫలనాలూ, గతకాలపు అవశేషాలూ ఏక కాలంలో కొనసాగుతూ ఉండే అవకాశం ఎప్పుడూ ఉంటుంది. ఈ రెంటి మధ్య ఐక్యత, ఘర్షణలతో కూడిన గతి తార్కిక సంబంధం ఉంటుంది. ఘర్షణే నిర్ణాయక శక్తి అయి, భవిష్యత్తుకు ప్రాతినిధ్యం వహించే అంశం గెలుపొంది అదే ప్రధాన ధోరణి అవుతుంది. అంటే కొంతకాలం పాటు ప్రధానాంశంగా ఉన్న అంశం తన స్థానం మార్చుకుని అవశేషంగా మిగిలిపోతుంది. అప్రధానాంశంగా ఉన్న అంశం తర్వాత ప్రధానాంశం అవుతుంది. ఇదిగతి తార్కిక అభివృద్ధి క్రమమే. తెలుగు సీమలో సామాజిక పరిణామం గానీ, సామాజిక చైతన్య రూపాలు గానీ, ఆ రూపాలను అక్షరీకరించిన పత్రికలు గానీ ఈ నియమానికి లోబడే సాగాయి.

ఇలా సామాజిక పరిణామాన్ని తారీఖుల్లోకి బిగించలేమనే నియమాన్ని గుర్తిస్తూనే అయినా 1960 దశకాన్ని గొప్ప సృజనాత్మక దశకంగా చెప్పుకోవచ్చు. ప్రపంచ వ్యాప్తంగా యథాస్థితి కొనసాగజాలని పరిస్థితి ఈ దశాబ్దంలోనే తలెత్తింది. ఈ పరిణామం ఉపరితల రంగాలన్నిటా ప్రతిబింబించింది. తరతమ భేదాలతో వివిధ ఉపరితల రంగాలను అల్లకల్లోలం చేసిన ఈ సంక్షోభం అన్ని దేశాలకూ వ్యాపించింది. ప్రపంచ వ్యాప్తంగా సామాజిక చైతన్యం మీద, ప్రగతిశీల ఉద్యమాల మీద సోవియట్ పార్టీ ఇరవయ్యవ కాంగ్రెస్ కప్పిన చీకటి తెర తొలగడం మొదలయింది. చైనాలో మహత్తర శ్రామిక వర్గ సాంస్కృతిక విప్లవం, ఆగ్నేయాసియాలో విప్లవోద్యమాల విజృంభణ, ఆఫ్రికాలో ఉధృతమైన జాతీయ విముక్తి, వలస వ్యతిరేక ఉద్యమాలు, అమెరికాలో బ్లాక్ పాంథర్స్, మధ్య అమెరికాలో, లాటిన్ అమెరికాలో విముక్తి. ఉద్యమాలు, వియత్నాం యుద్ధ వ్యతిరేకోద్యమం, ఫ్రాన్స్ విద్యార్థి ఉద్యమం, యూరప్ అంతటా యుద్ధ వ్యతిరేక, వాతావరణ పరిరక్షణ ఉద్యమాలు చెలరేగిందీ దశాబ్దం లోనే

ఈ ప్రపంచ వ్యాపిత కోపోద్రిక్త సంచలనంలో భాగంగానే మన దేశంలో నక్సల్బరీ ప్రజ్వలించింది. దేశరాజకీయ రంగం మీదికి సవ్యమయిన పరిష్కారాన్నీ మార్గాన్నీ సూచిస్తూ నక్సల్బరీ విస్ఫోటనం చెందడ మనదేశ సామాజిక పరిణామంలో ఒక గుణాత్మక మార్పు. ఈమార్పుకు దేశం సిద్ధపడి ఉంది. విసుగెత్తేంతగా పేరుకు

పోయిన చీకటిని బద్దలు గొట్టే వెలుగు రేక కోసం, భయంకర అసత్యాలు రాజ్యమేలుతూ ఊరేగుతున్న స్థితిలో ప్రశ్నాసాంప్రదాయం కోసం దేశం వేచి చూస్తున్నది. ఈ పరిణామమే సామాజిక చైతన్య రూపాలలో ప్రతి ఫలించడంనూ సహజమూ అనివార్యమూ కూడా.

ప్రపంచ వ్యాపితంగా, దేశ వ్యాపితంగా 1960 దశకంలో నెలకొని ఉన్న స్థితికి తెలుగుదేశం భిన్నంగా ఏమీలేదు. నిజానికి తెలుగుసమాజంలో పోరాట శక్తులకూ సామాజీక పరిణామానికి నాయకత్వం వహించ వలసిన శక్తులకు ప్రపంచ వ్యాపిత స్తబ్దతాకారణాలతో పాటు మరిన్ని కారణాలు ఉన్నాయి. తెలగాణా విమోచనోద్యమ విరమణ, ఎన్నికల రాజకీయాలు, 1955 ఎన్నికల పరాజయం వంటి కారణాలవి. ఒక వైపు సమాజం గుణాత్మక మార్పుకు సిద్ధమై ఉండగా ఆ మార్పుకు నాయకత్వం వహించవలసిన శక్తులు ఈ స్తబ్దతలో మునిగిపోయి ఉన్నాయి. నిరాశను జయించి అనివార్య పరిణామాన్ని త్వరితం చేయగల స్ఫూర్తిని పోరాట శక్తులు సంతరించుకో లేక పోయాయి.

"అందరూ నిద్రపోతున్నారు
అలసి నిత్య జీవితంలో సొలసి సుషుప్తి చెందారు
అలవాటునీ అస్వతంత్రతనీ కావలించుకున్నారు
అధైర్యంలో తమలో తాము ముడుచుకుపోయిపడుకున్నారు
అనంత చైతన్యోత్సవాహ్వాన్నా వినిపించుకోలేకపోయారు"
(దేవరకొండ బాల గంగాధర తిలక్, అమృతం కురిసిన
రాత్రి, పే.9 ) అనీ

"రేపటి ఉదయానికి వేసిన పట్టాల్ని ఎవరోతొల గించి వేశారు" (తిలక్, అమృతం కురిసినరాత్రి పే. 40) అనీ తిలక్ - 1960ల తొలిరోజుల తుఫాను ముందరి ప్రశాంతతకుఅద్దం పట్టాడు. ఇదంతాఅప్పుడున్న స్తబ్దతకు,ఆకాశరాత్రికి యథాస్థితి వర్ణన మాత్రమే. అప్పటికీ తెలుగు వచన కవిత ఈ నిరాశామయ దృశ్యాన్ని పట్టుకో గలుగు తోంది కాని ఈ దృశ్యాన్ని మార్చడం ఎట్లాగో దానికి తెలియదు. ప్రపంచ వ్యాపితంగా ఇలాంటి దృశ్యాన్ని మార్చటానికే వీస్తున్న కొత్త గాలిలో తెలుగు కవిత భాగం కావడానికి ఇంకా సమయం ఉంది.

చీకటి పట్ల, నిర్వ్యాపారం పట్ల, స్తబ్దతపట్ల, తక్షణం వెలువడే ప్రతిచర్యలు రెండు రకాలుగా ఉంటాయి. అవి విషాదంగాను, నిరాశగాను, నిస్సహాయతగానూ బయట పడవచ్చును. లేదా నిరసనగా, కసిగా, అసహాయ ఉద్రేకంగా వెలువడ వచ్చు. తెలుగు సామాజిక చైతన్య రూపాలు మొత్తంగాను, కవిత ప్రత్యేకంగాను ఈ రెండు రకాల ప్రతిఫలనాలను పొందింది. ఈ రెండు రకాల ప్రతిఫలనాలు మాత్రమే కాక, అసలు వర్తమానాన్ని, వర్తమానంలోని చీకటిని పట్టించు కోకుండా పలాయన వాదాన్ని ప్రతిబింబిస్తూ ఒంటరి వ్యక్తీకరణగా సాగిన కవిత్వమూ ఈ కాలంలో ఎక్కువగానే వచ్చింది.

ఒకవైపు నిరాశ, ఇంకొకవైపు విధ్వంసం, మరోవైపు పలాయనం చెల రేగుతున్న ఈ సంధి దశలోనే భవిష్యత్ నిర్మాణ ఆకాంక్షను వ్యక్తీకరించే కవిత్వమూ, ఇతర సామాజిక చైతన్య రూపాలూ, వాటిని అక్షరీకరించిన 'సృజన' ఆవిర్భవించాయి. విధ్వంసాన్ని మాత్రమే కాక నిర్మాణాన్ని, మౌలికంగా సృజనాత్మక నిర్మాణాని, ఆవిష్కరిస్తూ, హామీఇస్తూ తెలుగుకవిత్వంలో, సాహిత్యంలో ఒకగుణాత్మక పరిణామమూ, సృజన ఒకేసారి రూపు దిద్దు కున్నాయి.

ఈగుణాత్మక పరిణామాన్ని అర్థం చేసుకునే ముందు ఆ ముందరి పరిస్థితిని విశ్లేషించు కోవాలి. ఎందుకంటే పైననే చెప్పినట్టు గతకాలపు అవశేషాలు కొనసాగే అవకాశం ఎప్పుడూ ఉంటుంది గనుక ఈముందరిస్థితిలోని ప్రధానలక్షణాన్ని అర్థం చేసుకోవాలి.

50 లలోను 60ల తొలి రోజులలోను ప్రతిభావంతులై ఇతరులమీద ఇప్పటికీ ప్రభావాలుగా నిలచిపోయిన కవులు తిలక్, బైరాగి. సమాజం పట్ల వీళ్ళ దృక్పథం దృష్ట్యా చూసినప్పుడు ఈ ప్రత్యేక కాలానికి తెలుగు కవితకు వీళ్ళే బలమయిన ప్రతినిధులు కావడం యాదృచ్ఛికమో, ఆశ్చర్యకరమో కాదు. ఆకాలంలో ప్రాబల్యం పొందగలిగిన కవులు వాళ్ళే. సర్వమానవ సౌభ్రాతృత్వం అనే తిలక్ వాదం పలాయన వాదానికీ, యథాస్థితి సమర్థనకు మంచి ముసుగుగా మిగిలిపోయింది. ఏ ఇజంలోనూ నిజం లేదనే వాదం సహజంగానే కమ్యూనిజం పట్ల వ్యతిరేకతగా మిగిలిపోయింది. మానవతా వాదం, జీవకారుణ్య దృష్టి, దుర్మార్గంపట్ల నిర్లిప్తత వహించే భావుకుని ఉద్వేగంగా మిగిలిపోయాయి. ఇక బైరాగి గొంతుకోనయితే చీకటి నీడలు తారట్లాడడం స్పష్టంగానే కనబడుతుంది.

మొత్తం మీద ఈకాలపు తెలుగు కవితలో బలమయిన ధోరణికి వస్తువులో ప్రధాన లక్షణాలు నిరాశ, వేదన నిండిన వర్తమానం, దిక్కుతోచనితనం, మార్క్సిజంపట్ల వ్యతిరేకత, అర్థమూ,లక్ష్యమూలేని మానవతావాదం. వస్తువులో అభివృద్ధికర దృక్పథం, చారిత్రక ప్రగతిశీలస్పృహ లేక పోవడంవల్ల సహజంగానే కవిత్వ భాషలో పటుత్వమూ పోయింది. అర్థరహిత పద చిత్రాలు, కవిత్వంలోధార లేకపోవడం, అభివ్యక్తిసాంద్రత లేకపోవడం, పేలవమూ నిస్సారమూ అయిన అలంకారాలు, మిరుమిట్లు గొలిపే సమాసాలు కవిత్వంలో నిండిపోయాయి.

ఈ కాలంలో కూడా ఈ ధోరణిని ధిక్కరిస్తూ, నూతనత్వం కోసం తపిస్తూ, కవిత్వపు సామాజిక బాధ్యతను గుర్తిస్తూ కొన్ని గొంతులు వెలికి వచ్చినప్పటికీ అవి అప్పటికి బలహీన మయినవయిదువల్ల కొంతా, ఆధోరణికి కూడా స్పష్టమయిన మార్గం తెలిసి ఉండక పోవడం వల్లా కొంతా 66 దాకా కొత్త గొంతులకు ప్రాబల్యం రాలేదు.

వస్తు పరంగా నిరాశనూ నిస్సహాయతనూ వ్యక్తం చేసినప్పటికీ ఈ కాలపు బలమయిన, బలహీనమయిన గొంతులన్నీకూడా సాధించిన గొప్పవిజయం కవులను విస్తృతంగా ఉత్పత్తి చేయడం, కవిత్వానికి విస్తృత ఆదరణ కలిగించడం. అయితే ఈ ఫలితాలకు కారణాలు ఆనాటి కవితా వస్తువులో కన్న ముఖ్యంగా ఆనాటి సామాజిక పరిణామస్థితిలోనే ఉన్నాయి. 1947 తరువాతి పరిణామాలలో మొత్తంమీద అక్షరాస్యతా శాతం గణనీయంగా పెరగక పోయినా 1950 ల చివరనుంచి ఒక కొత్త విద్యావంతుల వర్గం ఉనికిలోకి రావడం మొదలయింది. స్వాతంత్ర్యం, భాషారాష్ట్రం ఏర్పాటు వంటి ఆలోచనవల్ల కొత్తగా తెలుగుభాషపట్ల, సంస్కృతిపట్ల గౌరవం పెరిగింది. విశ్వవిద్యాలయాలు అంతకంతకూ ఎక్కువగా మౌలికంగా కొత్త ఆలోచనలు గల ఒక చిన్న బృందాన్ని సమాజంలోకి పంపడం మొదలుపెట్టాయి.

నిజానికి ఇట్లా ఆవిష్కరణ పొందుతున్న ప్రగతిశీల, చైతన్యవంతమయిన యువరక్తాన్ని సామాజిక ఉద్యమం తనలో సంలీనం చేసుకొని ఉండవలసింది. తద్వారా ఈ నూతన ఆలోచనలు ఉద్యమవ్యక్తీకరణగా సామాజిక చైతన్య రూపాలను తీసుకొని ఉండవల్సింది. కానీ సామాజిక ఉద్యమం లేని స్థితిలో, చైతన్య

రూపాలను నిలబెట్టడం, మార్చడం వాటికవిగా ఉద్యమాలు కాగలవని తప్పుడు అవగాహన ప్రబలింది. రచన దాని సామాజిక స్వభావం నుంచి విడివడి, దానికదిగా ఉద్యమ మయింది. వచన కవితారచన ఉద్యమ రూపం ధరించింది.

ఈ కారణాలన్నీ కలగలిసి ఈదశకంలో తెలుగులో కవిత్వరచన అతిసులభ మయిన విద్యగా మారిపోయింది. ఈ పరిణామాలు వాటి సహజ ఫలితంగా కవిత్వ పాఠకుల సంఖ్యను పెంచాయి. మరో పక్కనుంచి పత్రికా రంగం అంతకు ముందు లాగ అభిరుచులపై, ఆశయాలపై ఆధారపడేదిగాకాక పెట్టుబడికీ లాభసాటి వ్యాపారానికీ కేంద్రమై, సాహిత్య విస్తృతికి కూడా కారణమయింది.

ఈ పూర్వ రంగంలో దిగంబర కవులు ఆవిర్భ వించారు. ఆనాటికి తెలుగు సమాజంలో నూతన కవితా వస్తువుకు రంగం సిద్ధమయి ఉంది. నూతన కవిత్వ పాఠకులు ఏర్పడి ఉన్నారు. ఏ సమాజం సామాజిక చైతన్యంలో గుణాత్మక పరిణామానికి భూమికను సిద్ధం చేసిందో, ఆ సమాజమే ఆ పరిణామానికి ఆహ్వానం పలకడానికి సిద్ధంగా ఉంది. అంటేవస్తువు, పాఠకుడు, కవి, కవితారూపం అనే నాలుగు అంశాలలో వస్తువు, పాఠకుడు గుణాత్మక మార్పుకు సిద్ధంగా ఉన్నారు. ఈ సామాజిక స్థితి విధించిన కర్తవ్యాన్ని కవి, కవితారూపం అందుకోవలసి ఉండింది.

దిగంబర కవుల రంగప్రవేశంలో ఈ రెండు అవసరాలూ సమగ్రంగా తీరనే లేదు. సామాజిక బాధ్యతకు అనుగుణంగా ఎదిగి ఉండవలసిన కవి, సామాజిక పరిణామంలోని విధ్వంస భాగాన్నే పట్టుకొని, పునర్నిర్మాణ భాగాన్ని విస్మరించాడు. తనకందిన కర్తవ్యంలోని విమర్శభాగాన్ని మాత్రం అర్థంచేసుకొని విప్లవభాగాన్ని నిర్లక్ష్యంచేశాడు. మరోవైపు కవితారూపంలో ఎదుగుదల అనేదాన్ని దిగంబర కవులు యాంత్రికంగా అర్థం చేసుకొని "స్వరూపాన్ని బట్టి మేం రాస్తున్న దాన్ని వచన కవిత అని మేం అనదలుచుకోలేదు. అననివ్వదలచుకోలేదు. వచన కవిత అనే పదం మాకునచ్చదు" (దిగంబర కవులు, ఎమెస్కోముద్రణ పే. 6) అని తమవి 'దిక్' లుగా ప్రకటించుకొన్నారు. నిజానికానాడు కొత్త కవితారూపాన్ని సమకూర్చు కోవడం అంటే వచనా కవితా రూపాన్ని కొన్ని వస్తు, రూపపరమయిన మార్పులతో స్వీకరిస్తే సరిపోయి ఉండేది. కాని దిగంబర కవుల దృష్టిలో కవితారూప అన్వేషణకూడా ఎగ్జిబిషనిజంగా మారి, 'దిక్' గా పరిణమించి, ఆచరణలో వచన కవితగానే మిగిలి పోయింది.

"ఎన్నటికీ మనం తిరగబడలేం కాబట్టి
ఎప్పటికీ మనకి తిరగబడడం చేతకాదు కాబట్టి
మన రక్తం నిండా కులాల మతాల మూత్రం ప్రవహిస్తున్నది కాబట్టి
మన సిరికి కుక్కలం పందులం కాబట్టి
మన జీవితాల్ని శాశ్వతంగా కొనేసి పరిపాలిస్తున్న
రకరకాల దుష్ట దేవుళ్ళను కొలవడానికి అంకితమవుదాం"
(నగ్నముని - దిగంబర కవులు - సంపుటి 3, పే. 119)

ఇలాంటి నిస్సహాయ ఉద్రేకాన్ని ప్రదర్శించడం దిగంబర కవితలో ప్రధాన లక్షణం. కోపాన్ని ఎక్కుపెట్టవలసిన వాడెవడో సక్రమంగా తెలియనప్పుడు, ఎవరి మీద ఎవరిలో కోపం రగిలించాలో తెలియనప్పుడు, ఆ కోపం ఒక నిర్దిష్ట రూపం ధరించాలని, సంఘటితం కావాలని అర్థంకానప్పుడు నిర్వ్యాపారం పట్ల ప్రతిస్పందన ఇలా ఉండడం చాల సహజం. అయితే ఇలాంటి సహజమయిన మేధోస్పందనను వ్యక్తీకరించడమే దిగంబర కవులలోని గుర్తించదగిన అంశంకాదు. వాళ్ళు ఈ వ్యక్తీకరణను అతి శక్తివంతంగా, 'షాక్' కలిగించేలా ప్రకటించారు. తెలుగు కవిత్వ చరిత్రలో వాళ్ళను అన్నిటికన్నా ఎక్కువగా వాళ్ళు ప్రారంభించిన, లేదా వాళ్ళు ప్రతిభావంతంగా వాడుకొన్న సాంప్రదాయం కోసం గుర్తించాలి. వాళ్ళ కవిత్వంలో అంతకు ముందరి దశ అవశేషాలు విరివిగానే ప్రతిఫలించినప్పటికీ వాళ్ళు ప్రధానంగా ప్రశ్నాసాంప్రదాయాన్నీ, ధిక్కారస్వరాన్నీ ముందుకు తెచ్చారు. తద్వారా వాళ్ళు సృష్టించి పెట్టిన రంగం రానున్న గుణాత్మక మార్పుకు సమర్థవంతమయిన భూమికగా నిలిచింది.

ఈ సమర్థవంతమయిన భూమికనుంచే రానున్న దశలోని ప్రధానధోరణి పురుటి నొప్పులు కనిపిస్తాయి.

"యాభై కోట్ల కంఠాలు
తిరుగుబాటు మంటలుగా మారాలి
వాస్తవ జీవితాన్ని వేలమైళ్ళ దూరంలో విసిరేసిన
విద్యాలయాలు వదలి
జట్లు జట్లుగా మెట్లు మెట్లుగా

యువకులు నడిరోడ్డుకు పసిగెత్తుకు రావాలి" (చెరబండరాజు, దిగంబర కవులు, సంపుటి 3 పే. 20) అని అస్పష్టంగానే అయినా దిగంబర కవితే ఆగామి కవిత్వానికివేదిక సిద్ధం చేసింది.

ఈ దశలో ఆవిర్భవించింది 'సృజన'. సృజన జన్మించడమే తిలక్ సంస్మరణలో జన్మించింది. కనుక పైన చెప్పిన రెండు దశల ప్రభావాలూ సృజన మీద బలంగానే ఉండడం సహజమే. అయితే అప్పటినుండి ఈ రెండు దశాబ్దాల పాటు 'సృజన' విర్లిప్తంగా ఆ ప్రభావాలు ప్రతిఫలించేదిగానే కాక క్రియాశీలంగా ఆ ప్రభావాలపై ప్రతి చర్య వేసేదిగా కొనసాగింది. కనుక ఈ రెండు దశాబ్దాల తెలుగు కవిత్వ చరిత్రనూ సృజననూ విడదీసి చూడడం అసాధ్యం.

సృజన చరిత్రలోనూ, తెలుగు కవితా చరిత్రలోనూ ఈ రెండు దశాబ్దాలలో ప్రధానంగా మూడు దశలున్నాయి. స్థూలంగా ఇవి సామాజిక పరిణామదశల ప్రతి ఫలనాలు కూడా. ఈదశల విభజన ఆయాకాలాలలో ప్రధానంగా ఉన్న ధోరణిని బట్టి చేయవచ్చును. పాత ధోరణుల అవశేషాలు కొనసాగుతూ కొత్త ధోరణిని ఆవిష్కరిస్తూ సాగివచ్చిన 1966-69 దశ మొదటిది. 1970 నుంచి 1974 దాకా ప్రబలంగానూ 1977 దాకా బలహీనంగానూ సాగివచ్చిన దశ రెండవది. ఈ దశలో ప్రధాన లక్షణం సామాజిక పరిణామంలోని ప్రత్యేకతను మాత్రమే అర్థం చేసుకొని సాధారణత్వాన్ని విస్మరించడం. ఈ దశలో కవిత్వం తాత్విక స్థాయిలోను సాధారణస్థాయిలోను కాక ప్రత్యేకస్థాయిలో, తక్షణప్రతిఫలనం స్థాయిలో వచ్చింది. అందువల్ల సామాజిక పరిణామంలోంచి అభివృద్ధికర చలనాలను వెతికి పట్టుకొని సాధారణీకరించడం జరగలేదు. కేవలం సామాజిక పరిణామాన్ని దాని యథాతథ రూపంలో చిత్రించడం జరిగింది. 1977-78లో మొదలయి నానాటికీ ప్రబలమవుతూ, విస్తృతమవుతూ ఇవాల్టిదాకా సాగి వచ్చిన దశ మూడవది. ఈ దశలో కవిత్వం ఒక సామాజిక చైతన్య రూపంగా తన పాత్రనూ, బాధ్యతనూ గుర్తెరుగు తున్నది. నిర్దిష్టతనుంచి తాత్విక, సాధారణ స్థాయి లకి పరిణామం చెందుతూ తత్ఫలితమయిన అభివ్యక్తి సాంద్రతను సంతరించు కొంటున్నది. ఈ సాంద్రత అనివార్యంగా తెచ్చే క్లిష్టత ఉన్నప్పటికీ, ఇప్పటిదాకా తెలుగు వచన కవిత చేసిన ప్రయాణానికి ఈ దశ శిఖరాయమానంగానే ఉంది.

ఈ విభజన లోని మొదటి దశలో సృజన తన ప్రయాణం ప్రారంభించింది.

"పద్యమా! అంతే
అడవిలేని చెట్టులేని గూడులేని పిట్ట
ఆకాశంలో కదే పోత నువ్వెంత వెల్తురు నొక్కినా
దాని రెక్కల్ని కాల్చదు సరిగదా పిట్ట నేల మీద మరి రాలదు
గగనంలో
ఆనంద దుఃఖ హేతువులనంతాలు అనవ గాహనలు...."
(వేగుంట మోహనప్రసాద్, సృజన, ఫిబ్రవరి67)
అనీ,

"ఏదైనా పెద్దయింట్లో ఎదిగివచ్చిన కొడుకుపోయో
ఓర్పునేర్చిన కోడలు పోయో పసుపు రాసిన పెద్ద గుమ్మంలో
నిశ్శబ్దం ఆవహిస్తుంది శోకం విస్తుపోతుంది
ఆ దుఃఖం యిట్లాంటిది
యిట్లాంటి పరమోత్కృష్టమైన దుఃఖం లేనేలేదికని వర్ణించు
కుంటాం
ఎప్పటి కప్పుడు అశ్రువులతో విచారాన్ని చెరిపేసుకుంటాం
.... .... ....
ఎటూ కన్నీళ్ళ నాపుకోలేమూ ఆర్పుకోలేమూ ఏదన్నా నదిలా
ఒక్కసారిగా పగిలిపోయి ఘోరుమందామా"
(వేగుంట మోహనప్రసాద్, సృజన, నవంబర్ 1967) అనీ

గతదశలోని నిస్సహాయత, అచేతనత్వం, నిర్లిప్తతల అవశేషాల్ని ఈదశ ప్రతి ఫలించింది. అదే సమయంలో ఈ దశలో

"దయ్యపు చెట్లను
విరగదోసే గాలి రావడం లేదు
నీళ్ళలో నిప్పు (టంకశాల అశోక్, సృజన)
ఇంకా పుట్టడం లేదు" అనే విసుగూ కనబడుతుంది.
"దంతపు పేటికలో
జీవితాన్ని భద్రపరచు కోవాలనే ఆరాటం
కాఫీ కప్పు అందున వారసుకొని

నీ పెదాల్లోకి పారే జీవితమై
తిరిగి తిరిగి సుడిగుండమై
నీ లోని మత్తుకోసం బ్రతికే నీవు
క్రమ పరిణామంలో పయనిస్తుందని
సమకాలీన సమాజంతో సంధిచేసుకున్నావు"

(నిఖిలేశ్వర్, సృజన, ఫిబ్రవరి 1967)

అనే వాస్తవ చిత్రణతో కలిసిన నిరసా కనబడుతుంది. ఈ నిరసన లోంచే భవిష్యదాశ మొలకెత్తింది.

"అబ్బ - యీ రాత్రి గడుస్తుందా
ఈ అచేతనత్వం - నిశ్శబ్దం మరణిస్తుందా
అదిగో తెల్లవారుతున్నట్టుంది
సూర్యుడు కనిపించడం లేదు కాని
దారి కన్పిస్తోంది - చెట్లూ చేమలూ అన్నీని"
(ప్రకాష్‌కుమార్, సృజన ఆగస్టు 1968)
అనే స్థితి నుంచి ఈ భవిష్యత్ ధోరణి
"ఇవాళ ఆరగట్టుకున్న ఈ పేగులు
రేపటి విప్లవ వీణకు తంత్రులు
ఈ కళ్ళలోని తడిలోంచి
రేపటి నెత్తుటి పువ్వులు పూస్తాయి
నిగళాలు పడ్డ ఈ చేతులు
నిర్భయంగా గళం ముడివిప్పే
నిప్పులాంటి కావ్యం రచిస్తాయి
ఇవాళ మండుతున్న ఈ గుండెల్లోంచి
రేపటి సూర్యుడు ఉదయిస్తాడు"

(ప్రభంజన్ ,సృజన, ఆగస్టు 1967)

అనే స్పష్టమైన ఆశ స్థితిని వ్యక్తీకరించేలా ఎదిగింది. దీనికి సహజమైన కొనసాగింపుగానే ఆశను మాత్రమే గాక ఆచరణను కూడ వ్యక్తీకరించే కవిత రూపు దాల్చింది.

"పదను పెట్టిన కత్తి అంచుమీద
రక్తాక్షరాలు
ఆహ్వానం అందుకో
ఇరవయ్యేళ్ళ అవమానంలో కాలి కాలి
ప్రేలుటకు సిద్ధంగా ఉన్నాను
ట్రిగర్ మీద వేళ్ళతో - రా
.... .... ....
ఈ సారి నీసమాధానం
అరిగిన మాటల్లో కాదు
విరిగిన వెకిలి నవ్వులోకాదు
ట్రిగర్ మీద పరుగెత్తే వేళ్ళలోంచి
మండే కనుల్లోంచి
మరిగే గుండె లోంచి
తుపానుల శ్వాసలోంచి
పరాభూతమైన ప్రతి అణువులోంచి
బులెట్ శబ్దంలోంచి రావాలి"

(లోచన్, సృజన, ఫిబ్రవరి 1969)

అని తెలుగు కవిత సాయుధ ఆహ్వానం పలికింది. సరిగ్గా ఈ సమయానికే సృజనకు బైట తెలుగు కవిత్వంలో 'తిరుగబడు', తెలుగు సమాజంలో శ్రీకాకుళం అరిగిన మాటల్నీ, విరిగిన వెకిలి నవ్వుల్నీ ఛీత్కరిస్తున్నాయి. ఆ శ్రీకాకుళ సమర దృశ్యాన్ని తెలుగు కవిత ప్రతిభావంతంగా, యథాతథంగా పట్టుకునేవేళ అంటే రెండో దశలోని ప్రధాన ధోరణి ప్రబలం కావడానికి తగిన స్థితి మొదలైంది.

"బంధనలో బతుకలేక
పిడికిలి వేసిన దెబ్బకు
తగిలించిన తాళాలకు పగుళ్ళు
పటేలుమని పడిపోతున్న కటకటాలు
కళ్ళొత్తుకునేకాలం తీరి
కళ్ళ వెంట నెత్తుర్లుకారినప్పుడు

కసిగా ముడిబడ్డది ఫాలం
పిడికత్తులకై పరువెత్తినవి చేతులు
గుండెలపై సమ్మెట పోటులు పడితే
రాలిపడ్డ నెత్తురు చుక్కలు
విరిగిపడ్డ హృదయపు చెక్కలు
విన్పిస్తూ విహరిస్తున్నవి
కదనంలో కత్తుల మ్రోతలు
బ్రతుకుపైన విశ్వాసంతో కూలివండు దండయాత్ర
న్యాయంపై నెత్తుటి మరకలు
తెగిపారిన నెత్తురులో ఎగరేసిన ఎర్రజెండ"
(ఎన్. కె. ,సృజన, మే 1970)

మొదటి దశకు ఈ కవిత ముగింపు పలికిందని చెప్పవచ్చును. 'తిరుగబడు' సంకలనంతో మొదలయి, 'ట్రిగర్ మీద వేళ్ళతో' కవిత ద్వారా, పై కవిత ద్వారా, విరసం ఆవిర్భావం ద్వారా, 'మార్చ్' సంకలనందాకా సాగివచ్చిన క్రమం మొదటి దశను ముగించి రెండో దశలోకి గుణాత్మక పరిణామాన్ని ప్రకటించింది. ఈ క్రమం తెలుగు కవితలో నూతన ధోరణిని బలమైన ధోరణిగా ఆవిష్కరించి, స్థాపించింది. కొత్తపద చిత్రాలు, ఉద్వేగ ప్రేరణ, ధార రెండో దశ ఆవిర్భావాని అవసరమైన స్థాయికి ఎదిగాయి.

అయితే ఈ మొదటిదశ పరిణామ క్రమం సరళరేఖ కాదు. దేనికది స్వయం సంపూర్ణంగా జరిగింది కూడాకాదు. ఆ క్రమం మొదటి దశను రెండోదశలోకి పరిణమింప జేయడంలో నిర్ణాయకపాత్ర సామాజిక చలనానిదే అయినా ఈక్రమాన్ని నిర్దేశించిన శక్తులలో సృజనకు కూడా ప్రధాన పాత్ర ఉంది.

ఒక వైపు కొనసాగుతున్న వర్తమానానికి ప్రతిఫలన వేదికగా తిలక్ ఛాయలను, దిగంబరకవితా ఛాయలనూ తనలో భాగం చేసుకొంటూనే సృజన నూతనత్వం కోసం తపించింది. ఇరవయి సంవత్సరాల కింద ఈపని నిర్వహించడంలో సృజనకు సమగ్ర అవగాహనా భవిష్యత్ దృష్టి ఉన్నాయని చెప్పడం అతిశయోక్తే అవుతుంది. కానీ పునాదిలోని ఘర్షణలను ఉపరితల రంగాలు అసంకల్పితంగానయినా ముందే గ్రహించగలవని గుర్తిస్తే ఇది ఆశ్చర్యకరమయిన పరిణామంకాదు.

ఈనేపథ్యంలో చూసినప్పుడు సంపూర్ణ అవగాహన ఉండిగానీ లేకగానీ సృజన ఆగామి ధోరణులకు వేదికగా, ఆగామి ధోరణుల ప్రోత్సాహక శక్తిగా నిలిచింది. మూడో సంచికలోనే రక్తచలన సంగీత శృతి వినిపింప జేసింది. ఆకాలంలో తెలుగు వచన కవితలో ఒకనూతన అభివ్యక్తిని ప్రారంభిస్తున్న వేగుంట మోహనప్రసాద్‌ను సృజనే ప్రోత్సహించింది, "ఆధునిక కవితా ప్రక్రియగా స్థిరపడి పోయిన వచన కవితా రచనలో విద్యార్థుల ప్రతిభనూ, ప్రయోగ శీలత్వాన్ని గుర్తించి ప్రోత్సహించాలనే సంకల్పంతో ఆంధ్రప్రదేశ్‌లోని అన్ని కళాశాలలవిద్యార్థుల కొరకు" సృజన వచనకవితా రచనలో పోటీ నిర్వహించింది. రచనలో కొత్తదనమూ, మౌలికత, జీవం ఉండాలని ఒక నిబంధన విధించింది. ఈ పోటీలో ఉత్తమకవిగా ఎంపికయిన అమ్మంగి వేణుగోపాల్, ప్రత్యేకబహుమతికి ఎంపికయిన ఎన్. గోపి ఆ తరువాత కవులుగా లబ్ధప్రతిష్టులయ్యారు.

మరోవైపు దిగంబర కవితాసంకలనాల సమీక్షద్వారా, శ్రీ శ్రీ కవిత్వ సమీక్ష ద్వారా, వచన కవితా రూపం మీద చర్చద్వారా సృజన వచనకవితలో రానున్న ధోరణికి, రావలసిన ధోరణికి, ప్రగతి శీల పరిణామానికి రంగం సిద్ధం చేసి పెట్టింది.

అయితే ఒక తప్పును సరిచేసే క్రమంలో మరొక చివరికి వెళ్ళి మరొక తప్పు చేసినట్లుగానే తెలుగునాట సామాజిక పరిణామంలోను, కవిత్వంలోనూ ఒక అతివాదం తలెత్తింది. సామాజిక పరిణామంలోనయితే పోరాటపు ప్రత్యేకతను యాంత్రికంయగా కవిత్వంలో కూడా ఆ ప్రత్యేకతా చిత్రణే ప్రధాన ధోరణి అయింది. ఇలా ప్రత్యేకతను చిత్రించే క్రమం తాత్వికంగా ప్రజా రాజకీయాలకు భిన్నమయిన, వ్యతిరేకమయిన సైద్ధాంతిక ప్రతిపాదనను చేసే వరకు కూడా వెళ్ళింది. ఈ చిత్రణలో భాగంగానే 'అడవి', 'నెత్తురు', 'సూర్యుడు', 'తూర్పు', 'ఆయుధం', 'రేపు' వంటి పద చిత్రాలు అరిగి పోయాయి. కవిత్వంలో ఎప్పటి కప్పుడు పాత పదాల కలయిక వల్ల కొత్త పదచిత్రాల సృష్టి జరుగవలసి ఉండగా ఈ దశలో మాత్రం పదచిత్రాలు ఒకే అర్థాన్ని విసుగెత్తించేంతగా ప్రకటిస్తూ మందకొడిగా నిలిచి పోయాయి.

"హింస ప్రాకృతికమయిన స్వభావం
పిల్లతన చేతులతో నోటితో

పండ్లతో పోరాడితే తప్ప
తల్లి రక్తం పిల్లకు పాలుగా రావడం లేదు
ప్రేమలో రతిలో సృష్టిలో పెంపులో
జీవితంలో హింస
ఒక ఆనంద రూపంలో
ఆవిష్కరింప బడుతున్న సత్యం"
(మార్చ్ కవితా సంకలనం)

అంటూ ప్రజాపోరాటం హింసాయుతంగా ఉన్నదనే శత్రువు ఆరోపణను అంగీకరిస్తూ ఆ మాయలో పడి హింసకు సమర్ధనను వెతకడం ఈ దశ కవిత్వంలో ఉంది. పోరాటాన్నీ హింసనూ, గతితార్కిక ఘర్షణనూ హింసనూ సమానంచేయడం తాత్వికంగా తప్పు. ప్రజల కార్యాచరణ అనివార్యఘర్షణ అవుతుంది, ప్రతిహింస అవుతుంది. అంతేకాని అదెప్పుడూ హింస కాదు. మనం చేస్తున్నది హింసేనేమోనన్న భ్రమలోపడి దానిసహజత్వం వెతకనక్కర లేదు.

"రక్తం - నిర్మల రక్తం
రక్తం సృష్టి రక్తం పుష్టి
రక్తం పరుగు రక్తంబాట
రక్తంలో రాకెట్లు
రక్తంలో ప్రేలుడు
పర్వతాలు పొడిపొడిగా కూలుడు
రక్తంలో ట్రంపెట్స్
రక్తంలో డ్రమ్స్
రక్తంలో మూవింగ్ హిల్స్
రక్తంలో మార్నింగ్ సాంగ్స్
రక్తం ఎదురు తిరిగే శక్తి
రక్తం రాజీపడని కత్తి
రక్తంలోనే ఉదయిస్తాడు రవి
రక్తంతోనే వెలుగు తుందీ భువి
అందుకే కోల్పోయిన బతుకు రక్తంలో వెతుకు

రక్తం రక్తం
రక్తం ప్రాణం
రక్తంలో జీవనగానం"
(మార్చ్ కవితా సంకలనం)

"నిప్పులు పూయడం నా జీవితాదర్శం
నా కొమ్మలకు కాయలు మాత్రమే కాదు
భూస్వాముల తలకాయలు కూడా కాస్తాయి"
(ప్రభంజన్, సృజన ఫిబ్రవరి 1972)

"చీకటోళ్ళం
రేపటోళ్ళం
వర్గ శత్రుల చంపెటోళ్ళం" (ఎస్పీ, సృజన, జులై 1974)

వంటి రచనలు ఈదశలో వచన కవితలుగా వచ్చాయి. రక్తం అనేమాటను పదే పదే వాడడం ద్వారా బీభత్సం తప్ప మరే భావమూ పాఠకుడికి అందే అవకాశం లేదు. నిజానికి కవిత్వంలో పునరుక్తి ఒక ఉద్వేగాన్ని మరింత మరింత లోతుగా హత్తుకునేలా చేసేందుకు వాడతారు. కానీ ఈదశలో వచన కవితా రూపం కన్నా చెప్పదల్చుకొనే విషయానిదే పైచెయ్యి అయి వస్తు శిల్పాల ఐక్యత దెబ్బ తింది. శిల్పం పట్ల శ్రద్ధ వహించక పోవడం వస్తువుకు అదనపు బలాన్నివ్వదు సరిగదా వ్యతిరేక ఫలితాన్ని ఇస్తుంది.

అట్లాగే ఈదశలో ఒకానొక ఎత్తుగడను, పోరాట రూపాన్ని అత్యద్భుత మంత్ర దండం స్థాయికి ఎత్తి చూడడం, స్వీయమానసిక దృష్టి కోణానికి తోచే అతిశయోక్తులు సామాజిక పరిణామానికి అవసరమయిన ప్రజాభాగస్వామ్యాన్ని విస్మరించడం వంటి తాత్విక అపసవ్య ధోరణులెన్నో కనబడతాయి.

తాత్వికస్థాయిలో సరయిన పునాది కలిగిలేనందువల్లనే వస్తువు విషయంలో ప్రజా పోరాటాన్ని ఎత్తి పట్టాలనే ఉత్సాహం తప్ప అవసరమయిన తాత్విక అవగాహన లేనందువల్లనే ఈదశలో కవిత రూపంలో చాలా పేలవంగా వెలువడింది. పాద విభజన జరపకుండా వరుసగా అచ్చువేస్తే వచనంలా, కరపత్రంలా కనబడే కవితలెన్నో

వచ్చాయి. కవితాంశ గురించి ఏశ్రద్ధా లేకుండా విషయం మాత్రమే ప్రధానమనే ధోరణి ప్రబలింది. కవిత్వపు జీవలక్షణ మయిన ఉద్వేగ ప్రేరణ కరువయిపోయింది. ప్రాస మీది మోజు మళ్ళీ రంగం మీదికి వచ్చింది.

ప్రజా ఉద్యమం దృష్ట్యానూ వచన కవితా ప్రక్రియ దృష్ట్యానూ ఈదశ లోపపూరితమే అయినప్పటికీ ఈదశలోని గొప్ప అనుకూల అంశం ఏమిటంటే ఈదశే తెలుగు కవిత్వ చరిత్ర అంతవరకూ కనీవినీ ఉండని స్థాయిలో, సంఖ్యలో కవుల్ని సృష్టించింది. ప్రధానంగా తరతరాలుగా మౌఖిక కవితా సాంప్రదాయంలో ఉండిన, లిఖిత సాహిత్యంనుంచి దూరంకొట్ట బడిన వర్గాలనుంచి కవులు రావడం మొదలయింది. ఉద్యమ పురోగతి వల్ల కవితా పాఠకుల సంఖ్య విపరీతంగా పెరిగింది. ఈకవులకు, కవితా పాఠకులకు కూడా విప్లవంపట్ల, కవిత్వంలో వస్తువుగా ప్రజాపోరాటం ఉండడం పట్ల గాఢమయిన అభినివేశం ఉంది. అంటే ఈదశ దాని అత్యున్నత స్థితికి చేరుకునే నాటికి వస్తువు, పాఠకుడు, కవి, కవితారూపం అనే నాలుగు అంశాలలో రూపంతప్ప మిగిలినమూడు అంశాలూ అవసరమయిన స్థాయికి ఎదిగి ఉన్నాయి. అప్పుడిక కవిత్వ ప్రయోజనానికి కొలబద్దగా రూపమే ప్రధాన పాత్ర వహించే స్థితి వచ్చింది.

అప్పుడు మంచి కవిత్వం అంటే ఏమిటి, కవితాంశ అంటే ఏమిటి వంటి మౌలిక ప్రశ్నలు మళ్ళీ ఒకసారి కవులముందు కొచ్చాయి. విప్లవ కవులు నినాదాలనే కవిత్వంగా ప్రచారం చేస్తున్నారని శత్రువూ, కొందరు మిత్రులూకూడా కొంత వరకు పాక్షిక సత్యాలపై ఆధారపడి చేసిన విమర్శ, కవితారూపంపట్ల పునరాలోచనకు వీలు కలిపించింది. కవితా రూపం పట్ల పునరాలోచనలో మంచి రూపానికి ఉదాహరణలుగా రెండోదశలోనే వెలువడిన ఎన్నో కవితలు ఆదర్శనీయమయ్యాయి. శివసాగర్ కవిత లలోని తాత్వికత, ఉద్వేగప్రేరణ, కవితాంశ కవితారూపచర్చకు పునాది అయ్యాయి. తరువాత కాలంలో ప్రధాన ధోరణి కానున్న ఈ ధోరణిని శివసాగర్ 1971 లోనే ప్రారంభించినా అది రెండో దశంతా బలహీనంగా సాగి వచ్చింది.

రెండోదశలో ఈ ధోరణి బలహీనంగా సాగివచ్చినప్పటికీ ఈ ధోరణిని ప్రచారం చేయడంలో, స్థాపించడంలో సృజన ముఖ్య పాత్ర వహించింది. అట్లని సృజన సమకాలీన ప్రధాన ధోరణిని విస్మరించలేదు. ఇప్పుడు పరిశీలిస్తే పేలవంగా కనబడే రెండో దశలోని ప్రధాన ధోరణి కవితలను ఒకవైపు ప్రచురిస్తూనే భవి

ష్యత్ ప్రగతిశీల ధోరణిని సృజన ఉద్దేశ పూర్వకంగా గానీ అసంకల్పితంగా గానీ ఎత్తి పట్టింది. ఇప్పుడు సింహావలోకనం చేస్తే మూడోదశలోని ప్రధాన ధోరణికి ప్రాతినిధ్యం వహించే కవితలు, రెండో దశలోని ప్రధాన ధోరణికి ప్రాతినిధ్యం వహించే కవితలు ఒకే సంచికలో సమాన ప్రాముఖ్యత వహించడం కనబడుతుంది. నిజానికి నూతన ధోరణి కవితలు బలహీనమైనవి కానప్పటికీ, కొన్ని చాల శక్తివంత మైనయినప్పటికీ, నాటి సామాజిక ఉద్యమంలోని ప్రధాన ధోరణి మూలంగాకవిత్వంలో కూడ ఈ ధోరణి ప్రధాన ధోరణి కాలేక పోయింది.

ఈ ధోరణిలో చెప్పుకోదగిన మొదటి కవితలు శివసాగర్ 'అలలు', 'మాతృ ఘోష'. కొత్త పద చిత్రాలు, ఉద్వేగప్రేరణ, తాత్వికస్థాయి ఈ ధోరణిలో ప్రధానాం శాలు వీటిలో మొదటి రెండు అంశాలా ఆ-యా కవితలలో కవితాంశను ఇనుమడింపజే సేవి కాగా,మూడో అంశం కవిత్వాన్ని ఉబుసుపోకకో, అలవోకగానో రాసే ప్రక్రియగా కాక సీరియస్ ప్రక్రియగా, విస్తృత ప్రయోజనం ఉన్న ప్రక్రియగా మార్చింది.

రెండో దశలోనే మొగ్గతొడిగిన నూతన ధోరణికి బలమైన కవితలలో 'ఉద్య మం నెల బాలుడు' ను 'ఉరిపాట'ను, 'వివిలా ! శాంటియాగో'ను చెప్పుకోవాలి. ఈ మూడు కవితలకూ నిర్దిష్ట సంఘటనల నేపథ్యం ఉంది. కాని అదే సమయంలో ఈ మూడు కవితలూ మొత్తం మీద విశ్వజనీనం కూడ అవుతాయి. " నా కవిత్వానికి ఉత్తేజం విశ్వజనీనంగానూ నిర్దిష్టంగానూ వున్నది." (ఉద్యమం నెలబాలుడు. x x iii) అని ఆయనే చెప్పుకున్నట్లు, ప్రధానంగా కవితాంశను నిర్ధారించే ఈ రెండు అంశాలూ ఈ కవితలలో ఉన్నాయి. ఉరిపాట రాసేప్పుడు కవి మనస్సులో భూమయ్య, కిష్టాగౌడ్‌లే ఉన్నప్పటికీ కవితా రూపం వల్ల ఆ కవిత ఎక్కడ ఎప్పుడు ప్రజల కోసం ఉరికంబం ఎక్కుతున్న మనిషికైనా అన్వయించేలా రూపుదిద్దు కుంది. అట్లాగే 'ఉద్యమం నెలబాలుడు' ను కవి ఉద్దేశించిన వ్యక్తికి కాక అలాంటి స్థితిలోనే ఉన్న మరే వ్యక్తికైనా ఉద్దేశించ వచ్చును. 'వివిలా శాంటియాగో' మరే నగరమైనా కావచ్చును. ఇలా సాధారణీ కరణ పొందడం వల్ల కవిత్వానికి సహజమైన పదచిత్రాలు, అభి వ్యక్తిలో నవ్యత, సార్వజనీన ఉద్వేగ ప్రేరణ కలుగుతాయి.

ఈ ధోరణి ఇంకా ప్రధానం కాకముందే రెండోదశ మధ్యలో నుంచే ఈ ధోరణిని అవలంబించే కవుల సంఖ్య పెరగడం మొదలయింది. ఐతే స్వయంగా శివసాగర్ కూడ రెండోదశలోని ప్రధాన ధోరణిలో కూడ కవిత్వం రాయడం వల్ల

కొంత, నూతన ధోరణి పాటించిన వాళ్ళలో ఎక్కువ మంది ప్రభావాల నుంచి, ఛాయల నుంచి బయటపడి సొంతగొంతు వెతుక్కోక పోవడం వల్ల కొంత నూతన ధోరణి చాలకాలం దాకా ప్రధాన ధోరణి కాజాలక పోయింది.

అత్యవసర పరిస్థితిలో, కొంచెం ముందు వెనుకలుగా ప్రజా ఉద్యమంలోనే పోరాట రూపాల పట్ల, అవగాహనల పట్ల సాగిన పునరాలోచన, వెలువడిన నిర్ధారణల పూర్వరంగంలో తెలుగు వచన కవితలో కూడ మార్పులకు పునాది బలీయం కావడం మొదలయింది.

ప్రజా రాజకీయాలు 1977 తర్వాత నిజమైన ప్రజాపంథాలో పదునుదేరగా, తెలుగు కవిత కూడ ఆకాలంలోనే బలమైన, అవసరమైన వస్తువును, బలమైన రూపంలో, సాంద్రతర వ్యక్తీ కరణలో వెలువరించడం ప్రారంభించింది. ఎమర్జన్సీలో అమలైన దారుణ నిర్బంధానికి ప్రతిచర్యగా ఎమర్జన్సీ తర్వాత అన్ని సామాజిక చైతన్య రూపాల్లో ప్రజాస్వామిక విలువల కోసం తపన, విరివిగా రూపుదిద్దు కుంది. ఎమర్జన్సీ తర్వాత తొలిరోజుల్లో వచన కవితలో కవితాంశనూ రూపాన్నీ కూడా ఈ ప్రజాస్వామిక విలువల తపనే నడిపించింది. ఒకవైపు ప్రజాపంథాను అమలు చేయడానికి ప్రయత్నిస్తున్న ప్రజా ఉద్యమం, మరోవైపు ఉధృతంగా వ్యాపిస్తున్న మౌఖిక సాంప్రదాయపు ప్రభావం కలిసి వచన కవితను సుసంపన్నమూ, ప్రబలమూ చేశాయి.

వచన కవిత ప్రజలపరం కావడంలో, ఎక్కువ మంది పాఠకులను ఆకర్షించ డంలో దీర్ఘకవితలు ప్రధాన పాత్ర వహించాయి. కుందుర్తిలో ప్రయోగ శీలత్వానికి మాత్రమే పరిమితమైన దీర్ఘ కవిత, విప్లవకవులు మౌఖిక సాంప్రదాయం నుంచి అంది పుచ్చుకున్న పునరుక్తి వల్ల, ధ్వనివల్ల, జాతీయాల వల్ల బహుళ ప్రచారంలోకి వచ్చింది.

స్మృతిగీతాలు, విప్లవ ఆహ్వాన కవితలు, నిర్దిష్ట సందర్భంతో వెలువడే కవితలు వంటి మూడు, నాలుగు పరిమిత తరగతుల నుంచి వచన కవిత ఇంకా విస్తృత స్థాయికి ఎదిగింది. ముఖ్యంగా తత్వశాస్త్ర అంశాలు, చరిత్ర, వాదవివాదాలు అద్భుతంగా కవిత్వీ కరణ పొంది, అతిక్లిష్ట విషయాలు సులభమైన వ్యక్తీకరణ పొందాయి.

ఈ సందర్భంలో సృజన చేసిన ప్రత్యేకమైన కృషి కవిత్వ అనుసృజనకు సంబంధించినది. మంచికవిత్వం అనువాదానికి లొంగదనే అభిప్రాయాన్ని తోసిరాజంటూ సృజన భారతీయ భాషలనుంచి, విదేశ భాషల నుంచీ ఎన్నో కవిత్వ అనుసృజనలను ప్రకటించింది. ముఖ్యంగా బెమలయాళీ, ంగాలీ కవుల కవితారచనా విధానం అనేక మంది యువకవులకు మార్గం చూపింది. వచన కవితకు ఒక నిర్మాణం వున్నదని, వచన కవితా రచన ఒక సీరియస్ ప్రక్రియ అని కవులు గుర్తించడం మొదలైంది.

రెండో దశలో వచన కవితలుగా చలామణీ అయి సృజనలో కూడా ప్రచురణ పొందిన కవితల్లో చాల భాగం ప్రస్తుత అంచనాలతో చూస్తే వచన కవితలుగా గుర్తింపుకు రావడంలేదు. ఇందుకు కారణం వచన కవిత్వం పట్ల పాఠకుల దృష్టి కోణంలో గణనీయమైన మార్పు వచ్చింది. ఇవాళ కవిత్వంగా గుర్తింపు పొందుతున్న దానిలోవచనం ఎక్కడో ఒకచోట గతకాలపు అవశేషంగా తప్ప మిగలలేదు. ప్రధానంగా కవితాంశ ఉన్న వచన కవిత్వమే వస్తోంది. అట్లాగే పదచిత్రాల ఎంపికలోనూ. కొత్త పదచిత్రాల సృష్టిలోనూ, ఇవాల్టి కవులు అద్భుతమైన ప్రతిభ కనబరుస్తున్నారు. ఇక వస్తువు విషయాని కొస్తే, ఇవాల్టి కవులు ప్రశంసనీయమైన పరిణతి సాధించి తాత్విక, సాధారణీ కృత స్థాయిలో కవిత్వాన్ని వెలువరిస్తున్నారు.

అయితే ఈ చివరి అంశమే ఇవాల్టి కవిత్వానికి ఒక ప్రతికూల లక్షణాన్ని కలిగిస్తున్నది.అదేమంటే కవి తాత్విక,సాధారణ స్థాయిని అందుకున్నప్పుడల్లా అమూర్తమూ, క్లిష్టమూ, కఠినమూ, మార్మికమూ అయిపోతున్నాడు. ఇలా జరగకుండా చూసుకోవలసిన బాధ్యత ప్రధానంగా కవిదే. ఈ లోపం పూరించుకుంటే తెలుగు కవితా ప్రమాణంలో ఇవాల్టిదశ, ఒక ఉజ్వలదశగా చరిత్రలో నిలుస్తుంది.

ఈ దశలోని ప్రధాన ధోరణిని నిర్ధారించడానికి ఇవాళవస్తున్న కవితలలో అత్యధిక భాగం కవితల నుంచి ఉదాహరణలు చూపవచ్చు. ఇక్కడ జులై సెప్టెంబరు 1986 అరుణతార సంచిక నుంచి ఒక కవితను ఉదహరించి ఈ విశ్లేషణ ముగిస్తాను.

ఈ కవితలో వాడిన పదచిత్రాలు- అర్ధరాత్రి నగర నిశ్శబ్ద శవం, నెత్తుటి అక్షరాలు, తడి ఆరని నిన్నటి పోస్టర్లు, ఆవులించే ఫ్యాక్టరీలు, ఆఫీసులు, విద్యార్థులు,

కరపత్రాల పక్షులు, విద్యుత్ సంగీతం తదితరాలు. ఇందులో పాఠకుడి ఊహకు అందని సమాసాలు, అలంకారాలు లేవు. ఇవన్నీ మామూలు మాటలతో వాడిన పదచిత్రాలు, కాని ఈ పదచిత్రాల బిగింపు ఎంత శక్తివంతగా నైనా ఉండగలవని కవి రుజువు చేశారు. అట్లాగే ఇది ఏకకాలంలో సార్వజనీనమూ, విశిష్టమూ కూడా. ఇందులో కవిత్వపు జీవలక్షణమైన ఉద్వేగ ప్రేరణా వుంది.

"అర్ధరాత్రి నగర పిశ్శబ్ద శవంమీద
నెత్తుటి అక్షరాలు రాయబడతాయి
పోలీసు స్టేషన్ల ఎదట
బస్టాపు గోడలపైనా
నీరసంగా విర్లిప్తంగా మానవ
సజీవ దేహాల్ని మోసుకెళ్ళే బస్సులపైనా
నిజాల్ని చూడలేని కోర్టుల నల్లకోట్లపైనా
తడి ఆరని నిన్నటి పోస్టర్లపైనా
మళ్ళీ అవే, అవే ఘటనలు
పేర్లూ, స్థలాలూ మారి మనల్ని ప్రశ్నిస్తూ నిలబడతాయి
ఆవులించే ఫ్యాక్టరీలు, ఆఫీసులు, విద్యాలయాల మధ్యా
పగిలిన సీసాల ముట్టల్లా కిక్కిరిసిన చౌరస్తాల్లో
ముసురుకునే షిఫ్టు బస్సుల వద్దా
భద్రతారహిత జీవితపు కలుగుల్లో
భద్రత వెతుక్కొనే గొర్రెల మందల మధ్యా
సాయంత్రాలు కరపత్రాల పక్షులు రెక్కలు విప్పుతాయి
వీధుల్లో కరెంటు తీగలపై విద్యుత్ సంగీతాన్ని మీటుతాయి

నడుస్తున్న చరిత్ర పుటల్లోంచి :

# రెండు రెళ్ళు నాలుగన్నందుకు ...

ఆపరేషన్ బ్లూస్టార్ తర్వాత పంజాబ్‌లో సైన్యం జరిపిన అత్యాచారాలపై హర్జీమాలిక్ రాసిన వ్యాసం అచ్చువేసినందుకు గాను బొంబాయి నుంచి వెలువడే 'ఎకనమిక్ అండ్ పొలిటికల్ వీక్లీ' ఏలిన వారి ఆగ్రహానికి గురవుతోంది.

1984 సెప్టెంబర్ 15 సంచికలో అచ్చయిన ఈ వ్యాసం అసలు ప్రతిని, ముద్రణ బ్లాకులను, దేశంలో విదేశాలలో ఎకనమిక్ అండ్ పొలిటికల్ వీక్లీ చందాదారుల, అమ్మకం దారుల చిరునామాల జాబితాలను తమకు అందజేయ వలసిందిగా బొంబాయి సి ఐ డి క్రైంబ్రాంచికి చెందిన సబ్ ఇన్‌స్పెక్టర్ నోటీసు జారీ చేశాడు. సెక్షన్ 124 (రాజద్రోహం), 505 (1 బి) (రాజ్యానికి వ్యతిరేకంగా నేరంచేసేట్టుగా పురికొల్పడం)ల కిందశిక్షార్హులుగా హర్‌జీ మాలిక్‌పై, "ఇతరులపై" కేసు నమోదు చేశాడు.

అక్టోబర్ 14 న ఈ నోటీసు అందుకున్న సంపాదకుడు కృష్ణరాజ్ 17 న హైకోర్టులో రిట్‌పిటిషన్ వేశారు. వ్యాసం అసలు ప్రతి, బ్లాకులు మూడు నెలల కంటె ఎక్కువ కాలం దాచి ఉంచనందువల్ల అవి అందజేయలేమని ఆయన తెలియ జేశారు. చందాదారులు, ఏజంట్ల జాబితాలు అందజేయాలనడం పత్రిక "స్వతంత్ర వ్యక్తిత్వాన్ని చెడగొడుతుందని," అంతేగాక అది రాజ్యాంగంలోని 19 (1) అధికరణం కింద హామీ అందిన భావప్రకటనా స్వేచ్ఛకు వ్యతిరేకమని సంపాదకులు వాదించారు.

ఈ వాదనను అంగీకరిస్తూ బొంబాయి హైకోర్టు సి ఐ డి నోటీసును కొట్టి వేసింది. నోటీసులో అందించమని కోరిన సమాచారం చట్ట వ్యతిరేకమని హైకోర్టు అభిప్రాయ పడింది. "ఇతరులు" పేరు మీద సంపాదకుడు కృష్ణరాజ్‌ను అరెస్టు చేయగూడదని, అరెస్టు చేయదలచుకుంటే నాలుగు రోజుల ముందే తెలపాలని, అరెస్టు చేసినా వ్యక్తిగత పూచీపై వెంటనే విడుదల చేయాలని న్యాయమూర్తులు ఆదేశించారు.

సంస్మరణ

## 'వేడిగాలి' లో 'చావుగీతం'

ఇప్పుడు వీస్తున్న 'వేడిగాలి'నీ ఈ వేడిగాలిలో విషాదాన్ని నింపుతూ అసంపూర్ణ కర్తవ్యాన్ని గుర్తు చేస్తూ వినిపిస్తున్న 'చావుగీతాన్నీ' రికార్డ్ చేసిన మంచి కవి, పాత్రికేయుడు, స్నేహశీలి, విరసం సభ్యుడు కామ్రేడ్ సలంద్ర ఈ సెప్టెంబర్ 16న హైదరాబాదు ఉస్మానియా జనరల్ ఆస్పత్రిలో డాక్టర్ల నిర్లక్ష్యానికి గురయి మరణించాడు. నిజామాబాద్ జిల్లా సాహిత్యసంచలనంలో ముఖ్యపాత్ర వహించి విప్లవ సాహిత్యోద్యమానికి గణనీయమైన కానుకలందించిన సలంద్రను మేం సంస్మరించుకుంటున్నాం. ఇందూరువాణి, ప్రజారాజ్యం, కేకలు పత్రికల ద్వారా, ప్రజా సాహితి, అంబేద్కర్ యువజన సంఘం వంటి సంస్థల ద్వారా కామ్రేడ్ సలంద్ర నిజామాబాద్ జిల్లాలో సాగించిన కృషినీ, విరసం సభ్యుడుగా, రాడికల్ విద్యార్థిగా, విలేకరిగా, జర్నలిస్ట్స్ యూనియన్ సహాయకార్యదర్శిగా ఆయన పాలుపంచుకున్న కర్తవ్యనిర్వహణనూ 'సృజన' గుర్తు చేసుకుంటున్నది. దుర్మార్గ వ్యవస్థకు కామ్రేడ్ సలంద్ర పాడదలచుకున్న చావుగీతాన్ని ఆగిపోనివ్వమనీ, కొనసాగిస్తామనీ విప్లవ సాహిత్యోద్యమం తరఫున మేం ప్రకటిస్తున్నాం. భార్య రమ, కొడుకు ఆదర్శ్‌ల దుఃఖంలో భాగం పంచుకుంటున్నాం.

---

— 'సాహితీ మిత్రులు'

## ప్రయాణం

సలంద్ర

తమ్ముడూ
ఎంతటి కుట్ర పన్నుతున్నారో చూశావా ?
నిన్న ఎవడో తెల్లవాడు
మన మీద పెత్తనం చెలాయిస్తున్నప్పుడు
మనం స్వేచ్ఛ కావాలి
స్వాతంత్రం కావాలి
రొట్టె కావాలి
బట్ట కావాలి

దేశం గుల్లకావొద్దు
ఈ దేశంలో చీకటొద్దు
అని తమ్ముడూ !
నిన్న మనం
మన చెట్లూ చేమలూ
మన చేన్లూ చెలకలూ
విశ్వవిద్యాలయాలూ
అడవులూ కొండలూ
ఫ్యాక్టరీలూ
ఊళ్ళకు ఊళ్ళే
ప్రస్థానంలా
చేతులకు కత్తులు తొడిగి
చావుని ఘణానికి తగిలించుకుని
చైతన్య వసంత యుగాల
ఆశాజ్యోతిని
మనోమందిరంలో వెలిగించుకొని
తమ్ముడూ !
ఊరేగింపులా
కంచుకాగడాలతో మనం
సంద్రాలూ నిమ్నోన్నతాలూ
తృణ ప్రాయంగా
విజయావేశంతో
శంఖారావ నినాదాల మధ్యన
తూర్పున నిప్పంటించ
పోతున్నప్పుడు తమ్ముడూ !
ఒకడు సన్యాసి వేషం వేసుకుని
సొల్లు కబుర్లు చెప్పి
అహింసా సిద్ధాంత నపుంసకత్వాన్ని బోధించి -

"ఊరేగింపు ఆపేయండి
సూరీడు పుట్టడమేమిటీ ?"

కాదు మిత్రో అంటే
ఈ సారి అలాగే జరిగింది
విచిత్రమే జరిగింది
సూరీడు పశ్చిమానే ఉదయించాడు
అంటే
విజయ ప్రభంజన మార్గాన
మన ఆశయాల కోసం
అసమతా అస్తవ్యస్త
వ్యవస్థారథ చక్రాల కింద
వీరమరణం పొందిన
వీరుల్ని మరచిపోయి
ఎవడో ఏదో
కుళ్ళు కబుర్లు కూశాడని
బాలెట్ బాక్సులు మన
అదృష్ట రేఖలు మార్చేశాయంటే
మొదటి నుండీ గుంటనక్కలే
రేపటికి అర్థం తెలియని దోపిడీగాళ్ళే
కోకా కోలా సామ్రాజ్యవాదులో
కుర్చీల కోసం కొట్లాడుకునే వెధవలో
కొండమీద దీపం వెలిగించి
పశ్చిమాన సూరీడు పుట్టిండంటే
ఎలా నమ్మడం
వద్దు తమ్ముడూ !
వద్దు
ఈ మోసగాళ్ళ మాటలినొద్దు

మనం అర్థంలేని ఆలోచనల్లో
కూరుకు పోవద్దు
అంతా బూటకమే
వీళ్ళదంటా నాటకమే
సూరీడు పశ్చిమాన కాదు
తూర్పునే ఉదయిస్తాడు తమ్ముడూ !
ప్రసవ వేదన లేకుండానే
శిశువు పుడుతుందా ?
పొయ్యిలో మంట రగల్చందే
వంట అవుతుందా ?
పాముని మంత్రాలతో కాదు
కట్టెతోనే చంపాలి తమ్ముడూ
వద్దు తమ్ముడూ !
వద్దు
నాటకంలో ఎవడో ఏదో కూశాడని
మళ్ళీ మోసపోవద్దు
మనలో మనకు కలహాలొద్దు
అప్పుడే
తూర్పుకు నిప్పంటుకుంది
నడువ్ తమ్ముడూ నడువ్
మనగమ్యం చేరేదాకా
మనదారినే మనం పోదాం.

[1979 లో 'ప్రజాసాహితి' యువ రచయితల వేదిక, నిజామాబాద్ ప్రచురించిన సలంద్ర కవితా సంకలనం 'చావుగీతం' నుంచి.]

# కొత్త పుస్తకాలు

1. అనంతం- శ్రీశ్రీ ఆత్మ చరిత్రాత్మ చరిత్రాత్మక నవల, కూర్పు- చలసాని ప్రసాద్, విరసం ప్రచురణ, ఆగస్ట్ 1986, 1/8 డెమీ, 322+6 పేజీల ఫోటోలు, 25 రూపాయలు. ప్రతులకు : సి. ఎస్. ఆర్. ప్రసాద్, సి-132, ఎస్. వి. ఎన్. కాలనీ, గుంటూరు, 522 006.

2. భారతీయ దర్శనం - రాహుల్ సాంకృత్యాయన్, అను : అలూరి భుజంగ రావు, రాహుల్ సాహిత్య సదనం, గుడివాడ ప్రచురణ, జులై 1986, 1/8 డెమీ, 424+xiv పేజీలు, 20 రూపాయలు, ప్రతులకు : ఆలూరి భుజంగ రావు,రాహుల్ సాహిత్య సదనం, గుడివాడ, కృష్ణాజిల్లా 521 301.

3. సూరీడు మావోడు - కె. వి. ఆర్. కవితా సంపుటి - (1970-1985), ఝంఝు ప్రచురణలు, జనవరి 1986, 1/8 డెమీ, 128+22 పేజీలు, 10 రూపాయలు.

4. జైల్లో మూణ్ణెల్ల ముచ్చట - విరసం - ముందు వెనుకలు - కె. వి. ఆర్. ఝంఝు ప్రచురణలు, 1/8 డెమీ, 128 + viii + 54 + 12 + 8 పేజీలు, 12 రూపాయలు.

5. జగన్నాథ రథచక్రాలు. (శ్రీశ్రీ గురించి విమర్శా వ్యాసాలు 1950-86) కె. వి. ఆర్. ఝంఝు ప్రచురణలు, జూన్ 1986, 1/8 డెమీ, 172+xvi పేజీలు, 15 రూపాయలు- ఈ మూడు పుస్తకాలూ ప్రతులకు : కె. శారదాంబ, 11-33-957, కావలి, 524 202.

6. రూపం - సారం - బాలగోపాల్ సాహిత్య వ్యాసాలు, స్నేహ ప్రచురణ, ఏప్రిల్ 1986, 1/8 డెమీ, 72+36 పేజీలు, 5 రూపాయలు.

7. విభాత సంధ్యలు - తెలుగు సాహిత్యంలో సమాజం - సంపాదకుడు: సివి సుబ్బారావు, సౌత్ ఇండియా పబ్లికేషన్స్ ప్రచురణ, మార్చి 1986, 1/8 డెమీ, 68+xviii పేజీలు, 10 రూపాయలు.

8. కొడవటి గంటి కుటుంబరావు వాఙ్మయ జీవిత సూచిక - కాత్యాయనీ విద్మహే, జనవరి 1986, 1/8 డెమీ 112+26+3 పట్టికలు, 10 రూపాయలు, ఈమూడు పుస్తకాలూ ప్రతులకు : నవోదయ పబ్లిషర్స్, ఏలూరు రోడ్, విజయవాడ 520 002.

9. నా నెత్తురు వృథాకాదు - భగత్‌సింగ్ రచనలు, సంపాదకుడు : నిర్మలానంద, జనసాహితీ సాంస్కృతిక సమాఖ్య ప్రచురణ, మార్చి 1986, 1/8 డెమ్మీ, 292+Xii పేజీలు, 12 రూపాయలు.

10. సంగం-తెలంగాణా పోరాట నవల-తిరునగరి రామాంజనేయులు, జనసాహితీ సాంస్కృతిక సమాఖ్య ప్రచురణ, జూలై 1986, 1/8 డెమ్మీ, 242+×ii పేజీలు, 12 రూపాయలు. ఈ రెండు పుస్తకాలూ ప్రతులకు : మైత్రీ బుక్‌హౌస్, మసీదు వీధి, కారల్‌మార్క్స్ రోడ్, విజయవాడ 520 002.

11. మనకు తెలియని మన చరిత్ర-తెలంగాణా రైతాంగ పోరాటంలో స్త్రీలు- ఒక సజీవ చరిత్ర- కె. లలిత, వసంత కన్నబిరాన్, రమా మేల్కోటే, ఉమా మహేశ్వరి, సూసీతారూ, వీణాశత్రుఘ్న, ఎమ్. రత్నమాల, స్త్రీ శక్తి సంఘటన ప్రచురణ, 1/8డెమ్మీ, 296+48+16 ఫోటోలు+ మ్యాప్, 15 రూపాయలు, ప్రతులకు : నవయుగ బుక్‌హౌస్, సుల్తాన్ బజార్, హైదరాబాద్ 500 195.

12. ప్రాచీన భారతదేశ చరిత్ర- డి. డి. కోశాంబి పరిచయం- కె. బాలగోపాల్, హైదరాబాద్ బుక్‌ట్రస్ట్ ప్రచురణ, సెప్టెంబర్ 1986, 1/8 డెమ్మీ, 172+vi పేజీలు, 10 రూపాయలు.

13. పగటి కల-గిజుభాయి బధేకా, అను : పోలు శేషగిరిరావు, హైదరాబాద్ బుక్‌ట్రస్ట్ ప్రచురణ, నవంబర్ 1986, 1/8 క్రౌన్, 140 +× పేజీలు, రు. 7-50. ఈ రెండు పుస్తకాలూ ప్రతులకు: హైదరాబాద్ బుక్‌ట్రస్ట్, 3-6-637, హిమాయత్ నగర్, హైదరాబాద్ 500 029.

14. సముద్రం- వరవరరావు, సముద్రం ముద్రణలు, సెప్టెంబర్ 1986, 1/8 డెమ్మీ, 24+4 పేజీలు, 3 రూపాయలు.

15. భవిష్యత్తు చిత్ర పటం, ఇతర కవితలు-వరవరరావు, సముద్రం ముద్రణలు, సెప్టెంబర్ 1986, 1/8 డెమ్మీ 86+6 పేజీలు, 6 రూపాయలు.
ఈ రెండు పుస్తకాలూ ప్రతులకు సృజన కార్యాలయానికి రాయాలి.

SRJANA Telugu Monthly November 1986
Regd. No. with Registrar of Newspapers for India 10953/67

# కొత్తేమీ కాదు

—వ్లాదిమీర్ మయకోవస్కీ

ఉషోదయ ప్రతికానేత్రాల్ని
ఆందోళనతోనే తెరిచాను
యుద్ధతరంగ శ్రేణులనించి లేచిన
తుపాకి మందు వాసన అనుభవించాను
మనకు వార్తలేమీ లేవు
తుఫానూ సుడిగాలి గడిచిపోయాయి
మనకు ఆనందహేతువేమీ లేదు
కానీ
ఎవరూ దుఃఖించొద్దు
చరిత్ర జలాలు సంక్షోభమయమే
నౌకలు సముద్రంలో
అలలు రేపినట్లు
చరిత్ర జలాల పై కాల్యంతో
యుద్ధ విషాద అస్తవ్యస్తతను
మనం బద్దలు కొడతాం.

(1927)

SRJANA Au.
Ramananagar
Vijayawada - 520 010
Single copy Rs. 3-00
Annual Subscription Rs. 30-00